

JBM 02
Sep-Oct 2021

be the epistle of CHRIST

# క్రీస్తు పత్రిక

"రాతిపలక మీద గాని సిరాతో గాని వ్రాయబడక, మెత్తని హృదయములు అను పలకల మీద జీవము గల దేవుని ఆత్మతో మా పరిచర్య మూలముగా వ్రాయబడిన **క్రీస్తు పత్రిక** యైయున్నారని మీరు తేటపరచబడుచున్నారు" (2కొరింథి 3:3)





## JACOB'S WELL

## inside the CHURCH of St. PHOTINA



Jeriah Bible Mission

# లోపలి పేజీల్లో...





సంచిక-01



సంచిక-02

యేసు ప్రభువు కృపను బట్టి ఎంతో శ్రమకోర్చి మేము 'క్రీస్తు పత్రిక' అనే ఈ ద్వైమాస పత్రికను ప్రచురిస్తున్నాము. ఈ పత్రికను మీరు చదవడమే గాకుండా మీకు తెలిసిన మన సహోదరులకు కూడా పంపించి చదివేలా ప్రోత్సహించండి. ఇందులో ప్రచురించే ఆర్టికల్స్‌కు సంబంధించి ఏమైనా సందేహాలు వున్నా, సరిచేయాల్సి వున్నా మమ్మల్ని సంప్రదించండి.

ఇది రెండవ సంచిక, మొదటి సంచిక చదవాలనుకుంటే పక్కన ఉన్న మొదటి సంచిక ఇమేజ్‌పై క్లిక్ చేయండి లేదా మాకు వాట్సప్ చేయండి.

దేవుడు మనందరికి తోడైయుండి కాచి కాపాడి నడిపించును గాక!

-ఎడిటర్


**Published by :**
Jeriah Bible Mission
Peddapalli, Telangana-505172
7013 63 9470 (Plz Whatsapp only)

**Blog :**
jeriahbiblemission.blogspot.com

**email :**
jeriahbiblemission@gmail.com



**D.T.P. & Designing :**
adept Digitals, Peddapalli. 9395 11 3648

# ఆత్మతో సత్యంతో ఆరాధించుదాం...



క్రైస్తవ భక్తి జీవితములో 'ఆరాధన' అనేది అత్యంత ప్రాముఖ్యమైన అంశము. అన్యజనులలో నుండి రక్షింపబడిన మనము భక్తి, ఉపవాసము, ఆరాధన లాంటి అనేక విషయాల గురించి వాక్యానుసారముగా తెలుసుకొని ఆవిధంగా ప్రవర్తించడం చాలా అవసరం. అంతేగాని మన గత కాలపు (అనగా రక్షణలేని కాలంనాటి) అనుభవాలను, ఆచారాలను అనుసరించడం, అమలుపరచడం మంచి పద్ధతి కాదు. గత కాలపు ఆచారాలను పక్కనపెట్టి నిజదేవున్ని 'వాక్యానుసారంగా' వెంబడించే ప్రయత్నం చేద్దాం. అందులో భాగంగా మనం 'ఆత్మతోను సత్యముతోను ఆరాధించుట' అనే అంశము గురించి బైబిల్‌లో పరిశోధన చేసి వాక్యానుసారమైన దేవుని ఉద్దేశ్యాన్ని గ్రహించుదాం. ఈ విషయములో మీ స్వంత ఆలోచనలు పక్కనపెట్టి దేవుని వాక్యం ఏం చెబుతుందో ప్రార్థనాపూర్వకంగా తెలుసుకుందాం. పరిశుద్ధాత్మ దేవుడు మనకు సహాయం చేయునుగాక! ఆమెన్.

**"దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధింపవలెననెను"**

(యోహాను 4:24)

పై వచనము, యేసు ప్రభువు సమరయ స్త్రీతో యాకోబు బావి దగ్గర మాట్లాడిన సందర్భంలోనిది. ఇందులో ప్రాముఖ్యమైన పదాలు మూడు ఉన్నాయి. మొదటిది- **ఆత్మతోను**, రెండవది- **సత్యముతోను**, మూడవది- **ఆరాధించడం**. ఈ మూడు పదాలకు వాక్యానుసారమైన సరియైన అర్థాలను మనం తెలుసుకోగలిగితే ఆ వచనాన్ని సరియైన రీతిలో గ్రహించగలుగుతాం.

సామాన్యంగా ఆలోచిస్తే, ఆత్మతోను (ఆత్మలోను -ఫుట్‌నోట్ ప్రకారం) అంటే? ఆత్మ ద్వారా లేక ఆత్మ సంబంధమైన అనే అర్థాలు వస్తాయి. సత్యముతోను అంటే? సత్యము ద్వారా లేదా సత్య సంబంధమైన లేదా యధార్థంగా అనే అర్థాలు వస్తాయి. ఆరాధించడం అంటే? పూజించడం, స్తుతించడం అనే అర్థాలు వస్తాయి. అయితే పై మాటలకు సందర్భానుసారమైన అర్థం ఏమిటో, దేవుని యొక్క ఉద్దేశ్యం ఏమిటో గ్రహించాలంటే ఒకసారి ఆ సందర్భాన్నంతటిని చదివితే మనకు మరింత విషయం అర్థమవుతుంది. ఒకసారి 5వ వచనము నుండి జాగ్రత్తగా చదువుదాం;

యోహాను 4:5-24- "యాకోబు తన కుమారుడైన యోసేపుకిచ్చిన భూమి దగ్గరనున్న **సమరయలోని సుఖారను** ఒక ఊరికి వచ్చెను. అక్కడ **యాకోబు బావి** యుండెను గనుక **యేసు** ప్రయాణము వలన అలసియున్న రీతినే ఆ బావి యొద్ద కూర్చుండెను; అప్పటికి ఇంచుమించు పండ్రెండు గంటలాయెను. **సమరయ** స్త్రీ ఒకతె నీళ్లు చేదుకొనుటకు అక్కడికి రాగా యేసు–నాకు దాహమునకిమ్మని ఆమెనడిగెను. ఆయన శిష్యులు ఆహారము కొనుటకు ఊరిలోనికి వెళ్లియుండిరి. ఆ సమరయ స్త్రీ–యూదుడవైన నీవు సమరయ స్త్రీనైన నన్ను దాహమునకిమ్మని యేలాగు అడుగుచున్నావని ఆయనతో చెప్పెను. ఏలయనగా యూదులు సమరయులతో సాంగత్యము చేయరు. అందుకు యేసు–నీవు దేవుని వరమును–నాకు దాహమునకిమ్మని నిన్ను అడుగుచున్న

వాడెవడో అదియు ఎరిగియుంటే నీవు ఆయనను అడుగుదువు, ఆయన నీకు జీవజలమిచ్చునని ఆమెతో చెప్పెను. అప్పుడా స్త్రీ–అయ్యా, యీ బావి లోతైనది, చేదుకొనుటకు నీకేమియు లేదే; ఆ జీవజలము ఏలాగు నీకు దొరుకును? తాను తన కుమాళ్లును, పశువులును, యీ బావినీళ్లు త్రాగి మాకిచ్చిన మన తండ్రియైన యాకోబు కంటే నీవు గొప్పవాడవా? అని ఆయనను అడిగెను. అందుకు యేసు–ఈ నీళ్లు త్రాగువాడును మరల దప్పిగొనును; నేనిచ్చు నీళ్లు త్రాగు ప్రతివాడెప్పుడును దప్పిగొనడు; నేను వానికిచ్చు నీళ్లు నిత్యజీవమునకై వానిలో ఊరెడి నీటి బుగ్గగా ఉండునని ఆమెతో చెప్పెను. ఆ స్త్రీ ఆయనను చూచి–అయ్యా, నేను దప్పిగొనకుండునట్లును, చేదుకొనుట కింత దూరము రాకుండునట్లును ఆ నీళ్లు నాకు దయచేయుమని అడుగగా యేసు నీవు వెళ్లి నీ పెనిమిటిని పిలుచుకొని యిక్కడికి రమ్మని ఆమెతో చెప్పెను.

ఆ స్త్రీ–నాకు పెనిమిటి లేడనగా, యేసు ఆమెతో–నాకు పెనిమిటి లేడని నీవు చెప్పిన మాట సరియే; నీకు అయిదుగురు పెనిమిట్లుండిరి, ఇప్పుడు ఉన్నవాడు నీ పెనిమిటి కాడు; సత్యమే చెప్పితివనెను. అప్పుడా స్త్రీ–అయ్యా, **నీవు ప్రవక్తవని గ్రహించుచున్నాను. మా పితరులు ఈ పర్వతమందు ఆరాధించిరి గాని ఆరాధింపవలసిన స్థలము యెరూషలేములో ఉన్నదని** మీరు చెప్పుదురని ఆయనతో అనగా యేసు ఆమెతో ఇట్లనెను– **అమ్మా, ఒక కాలము వచ్చుచున్నది; ఆ కాలమందు ఈ పర్వతము మీదనైనను యెరూషలేములో నైనను మీరు తండ్రిని ఆరాధింపరు.** నా మాట నమ్ముము; మీరు మీకు తెలియని దానిని ఆరాధించువారు, మేము మాకు తెలిసినదానిని ఆరాధించువారము; రక్షణ యూదులలో నుండియే కలుగుచున్నది. అయితే **యథార్థంగా ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను తండ్రిని ఆరాధించు కాలము వచ్చుచున్నది; అది ఇప్పుడును వచ్చేయున్నది; తన్ను ఆరాధించువారు అట్టివారే కావలెనని తండ్రి కోరుచున్నాడు (వెదకుచున్నాడు). దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధింపవలెననెను.”**

పై సందర్భ వచనాలను బట్టి కొన్ని ప్రశ్నలు వేసుకుందాం.

1) ఎవరు ఎవరితో మాట్లాడుతున్నారు?
2) సమరయులు ఎవరు?
3) యూదుల–సమరయుల ఆరాధనా పద్ధతులేంటి?
4) సమరయులు గెరీజీము పర్వతము మీద ఆరాధించేవారు. సమరయులు ఆ పర్వతము మీదనైనను యూదులు యెరుషలేములోనైనను తండ్రిని ఆరాధించకుండా మరి ఎక్కడ? ఎలా? ఆరాధిస్తారు?



*Archaeological evidence shows that a temple was built on Mount Gerizim around 450 B.C.E. during the Persian period. The temple complex was expanded during the Hellenistic period around 200 B.C.E., and it functioned until the Maccabees destroyed it in 110 B.C.E.*

5) ఇప్పుడు యూదులు, సమరయులు ఆరాధించే విధానాన్ని కాదని దేవున్ని ఆరాధించువారు అట్టి వారే అనగా ఆత్మతో సత్యముతో ఆరాధించే వారే కావాలని ఎందుకంటున్నాడు?

పై ప్రశ్నలకు సమాధానాలు వెతికే ప్రయత్నం చేద్దాం! పై సందర్భంలో యేసు ప్రభువుల వారు సమరయ పట్టణంలో యాకోబు బావి దగ్గర సమరయ స్త్రీతో మాట్లాడుతున్నారు. మరి ఈ సమరయ ఎక్కడ ఉంది? ఈ సమరయులు ఎవరు?

## సమరయులు ఎవరు?

ఇలాంటి విషయాలు తెలుసుకోవడానికి బైబిలు పదకోశము (Concordance) లేదా ఆధార సూచికలను (Cross References) పరిశీలిస్తే మంచిది. బైబిలు నిఘంటువు లేదా బైబిలు మూల భాషలైన హెబ్రీ, గ్రీకు పదాలను పరిశోధించడం ద్వారా కూడా తెలుసుకొనవచ్చును. మనకు **BDB-T and Strong's** హెబ్రీ, గ్రీకు డిక్షనరీలు

అందుబాటులో ఉన్నాయి. వాటిల్లో స్ట్రాంగ్స్ డిక్షనరీ నుండి 'సమరయ' పదమును చూద్దాం!

**G(4540)** **Σαμάρεια, —** *sam-ar'-i-ah*; of Hebrew origin [**Hebrew {8111}** (Shomerown)]; *Samaria* (i.e. *Shomeron*), a city and region of Palestine: — Samaria.

**H{8111}** שֹׁמְרוֹן — **Shomrown,** *sho-mer-one';* from the active participle of 8104; watch-station; Shomeron, a place in Palestine: — Samaria.

పై వాటి ప్రకారంగా మనం గమనించినట్లయితే సమరయులు మరెవరో కాదు రెండవ రాజుల గ్రంథంలో చెప్పబడిన షోమ్రోనీయులే. ఒకసారి 2రాజులు గ్రంథం 17వ అధ్యాయము 24వ వచనము చదువుదాం;

2రాజులు 17:24- "అష్షూరు రాజు బబులోను, కూతా, అవ్వా, హమాతు, సెపర్వయీము అను దేశములలో నుండి జనులనురప్పించి, ఇశ్రాయేలువారికి మారుగా షోమ్రోను పట్టణములలో ఉంచెను గనుక వారు షోమ్రోను దేశమును స్వతంత్రించుకొని దాని పట్టణములలో కాపురము చేసిరి."

అంటే అష్షూరు రాజు బబులోను, కూతా లాంటి దేశాల నుండి షోమ్రోను పట్టణానికి రప్పించిన జనులే ఈ షోమ్రోనీయులు లేదా సమరయులు.

## సమరయులు మరియు యూదులు ఆరాధించే విధానం ఏమిటి?

కొంచెం శ్రద్ధగా 2రాజులు గ్రంథం 17వ అధ్యాయము 25వ వచనము నుండి చదువుదాం;

2రాజులు 17:25-41- "అయితే వారు కాపురముండ నారంభించినపుడు యెహోవాయందు భయభక్తులు లేనివారు గనుక యెహోవా వారి మధ్యకు సింహములను పంపెను, అవి వారిలో కొందరిని చంపెను.-తమరు పట్టుకొనిన షోమ్రోను పట్టణములలో తాముంచిన జనులకు ఆ దేశపు దేవుని మర్యాద తెలియకున్నది గనుక ఆయన సింహములను పంపించెను. **ఇశ్రాయేలు దేవుని మర్యాద వారికి తెలియనందున సింహములు వారిని చంపుచున్నవని వారు అష్షూరు రాజుతో మనవి చేయగా అష్షూరు రాజు-అచ్చటి నుండి తేబడిన యాజకులలో ఒకనిని అచ్చటికి మీరు తోడుకొనిపోవుడి; అతడు అచ్చటికి పోయి కాపురముండి ఆ దేశపు దేవుని మర్యాదను వారికి నేర్పవలెనని ఆజ్ఞాపించెను.**



*Sacrifices and Offerings of the Law of Moses*

కాగా షోమ్రోనులో నుండి వారు పట్టుకొని వచ్చిన యాజకులలో ఒకడు వచ్చి బేతేలు ఊరిలో కాపురముండి, యెహోవాయందు భయభక్తులుగా ఉండతగిన మర్యాదను వారికి బోధించెను గాని కొందరు జనులు తమ సొంత దేవతలను పెట్టుకొని షోమ్రోనీయులు కట్టుకొనిన ఉన్నత స్థలముల మందిరములలో వాటిని ఉంచుచువచ్చిరి; మరియు వారు తమ తమ పురములలో తమకు దేవతలను కలుగజేసికొనిరి. బబులోనువారు సుక్కోత్బెనోతు దేవతను, కూతావారు నెర్గలు దేవతను, హమాతువారు అషీమా దేవతను, ఆవీయులు నిబ్హజు దేవతను తర్తాకు దేవతను, ఎవరు వారి దేవతను పెట్టుకొనుచుండిరి. సెపర్వీయులు తమ పిల్లలను అద్రమ్మెలెకు అనెమ్మెలకు అను సెపర్వయీము యొక్క దేవతలకు అగ్ని గుండమందు దహించుచుండిరి. **మరియు జనులు యెహోవాకు భయపడి, ఉన్నత స్థలముల నిమిత్తము సామాన్యులలో కొందరిని యాజకులను చేసికొనగా వారు జనులపక్షమున ఉన్నత స్థలములలో కట్టబడిన మందిరములయందు బలులు అర్పించుచుండిరి.** ఈ ప్రకారముగా వారు యెహోవాయందు భయభక్తులు గలవారైయుండి, తాము ఏ జనులలోనుండి పట్టబడిరో ఆయా జనుల మర్యాదచొప్పున తమ దేవతలను పూజించుచుండిరి. నేటి వరకు తమ పూర్వమర్యాదల ప్రకారము వారు చేయుచున్నారు; యెహోవాయందు భయభక్తులు పూనక

-వారితో నిబంధనచేసి మీరు ఇతర దేవతలకు భయపడకయు, వాటికి నమస్కరింపకయు, పూజ చేయకయు, బలులు అర్పింపకయు, మహాధికారము చూపి బాహుబలము చేత ఐగుప్తు దేశములో నుండి మిమ్మును రప్పించిన యెహోవాయందు భయభక్తులు కలిగి ఆయనకు మాత్రమే నమస్కారముచేసి బలులు అర్పింపవలెనని ఇశ్రాయేలని పేరు పెట్టబడిన యాకోబు సంతతివారికి సెలవిచ్చిన దేవుని సేవింపకయు ఆయన ఆజ్ఞాపించిన కట్టడలను గాని విధులను గాని ధర్మశాస్త్రమును గాని ధర్మమందు దేనిని గాని అనుసరింపకయు ఉన్నారు. మరియు-ఇతర దేవతలను పూజింపక మీరు బ్రదుకు దినములన్నియు మోషే మీకు వ్రాసియిచ్చిన కట్టడలను విధులను, అనగా ధర్మశాస్త్రము ధర్మమంతటిని గైకొనవలెను. నేను మీతో చేసిన నిబంధనను మరువకయు ఇతర దేవతలను పూజింపకయు ఉండవలెను. మీ దేవుడైన యెహోవాయందు భయభక్తులు గలవారై యుండిన యెడల ఆయన మీ శత్రువుల చేతిలో నుండి మిమ్మును విడిపించునని ఆయన సెలవిచ్చినను వారు ఆయన మాటవినక తమ పూర్వపు మర్యాదచొప్పుననే జరిగించుచు వచ్చిరి. **ఆ ప్రజలు ఆలాగున యెహోవాయందు భయభక్తులు గలవారైనను తాము పెట్టుకొనిన విగ్రహములను పూజించుచు వచ్చిరి. మరియు తమ పితరులు చేసినట్లు వారి యింటివారును వారి సంతతివారును నేటి వరకు చేయుచున్నారు."**

పై వచనాలను బట్టి ఏం అర్థమౌతోంది? యూదులు **'బలులు అర్పించడం'** ద్వారా యెహోవాను సేవించేవారు. అదే విధానాన్ని షోమ్రోనీయులు అంటే సమరయులు నేర్చుకొని పాటించడం మొదలుపెట్టారు. కాని సమరయులు తాము అర్పించే బలులు యెహోవాకు మాత్రమేగాక వారి దేవతలకు కూడా అర్పించేవారు.

"జనులు యెహోవాకు భయపడి, ఉన్నత స్థలముల నిమిత్తము సామాన్యులలో కొందరిని **యాజకులను** చేసికొనగా వారు జనులపక్షమున ఉన్నత స్థలములలో కట్టబడిన మందిరములయందు **బలులు అర్పించుచుండిరి.**" (2రాజులు 17:32)

"ఆ ప్రజలు ఆలాగున **యెహోవాయందు భయభక్తులు** గలవారైనను తాము పెట్టుకొనిన **విగ్రహములను పూజించుచు** వచ్చిరి." (2రాజులు 17:41)



***Samaritans and their Priests***

సమరయుల గురించి పూర్తిగా తెలిసిన యేసు ప్రభువు ఇలా అన్నారు, "మీరు మీకు తెలియనిదానిని ఆరాధించువారు, మేము మాకు తెలిసినదానిని ఆరాధించువారము" (యోహాను 4:22)

పై వచనాలను బట్టి 'ఆరాధించడం' అనే పదానికి సందర్భసహితమైన అర్థం ఏమిటంటే **'బలులు అర్పించడం'** అని.

ఈ అర్థాన్ని ప్రతిక్షేపించి చూసినట్లయితే ఆత్మతో సత్యముతో ఆరాధించడం అంటే **'ఆత్మతో సత్యముతో బలులర్పించడం'** అనే భావము వస్తుంది.

## ఆత్మతోను, సత్యముతోను బలులను అర్పించాలి

ఆరాధించడం అంటే ఏమిటో తెలుసుకున్నాము కదా! ఇక ఆత్మతోను, సత్యముతోను అంటే ఏమిటో తెలుసుకుందాం.

సత్యముతో అంటే? సత్యము ద్వారా లేదా సత్యసంబంధమైన లేదా యథార్థంగా అని అనుకున్నాము కదా! ఒకసారి యోహాను 4:23 గమనించినట్లయితే-

"అయితే **యథార్థముగా** ఆరాధించువారు ఆత్మతోను **సత్యముతోను** తండ్రిని ఆరాధించు కాలము వచ్చుచున్నది" అని చెప్పబడింది. అంటే సత్యముతోను అనగా యథార్థముగా అనే అర్థం గాకుండా వేరే అర్థం వస్తుందన్నమాట. ఎందుకంటే సత్యంతోను అంటే యథార్థముగా అనే అర్థం వస్తే యేసు ప్రభువు మళ్లీ 'యథార్థముగా ఆరాధించువారు' అని చెప్పకపోవును. కాబట్టి సత్యంతోను అంటే అర్థమేమిటో తెలుసుకోవాలంటే ఆ పదానికి బైబిల్లో వాడిన ఇతర పర్యాయ

పదాలను వెదకాలి.

పైన చెప్పినట్లుగా పదకోశమునుపయోగించి తెలుసుకున్నట్లయితే, యోహాను 17:17లో, **"నీ వాక్యమే సత్యము"** యోహాను 14:6లో, **"యేసు-నేనే** మార్గమును, **సత్యమును,** జీవమును, నా ద్వారానే తప్ప యెవడును తండ్రి యొద్దకు రాడు." అనే వచనాలు మనకు కనిపిస్తాయి. ఈ వచనాలను బట్టి సత్యముతోను అంటే? **వాక్యము ద్వారా లేదా యేసు క్రీస్తు ద్వారా** అనే అర్థాలు వస్తాయి.

ఇక మిగిలింది 'ఆత్మతోను' అనే పదం. ఇక్కడ బైబిల్‌లో ఆత్మ అనే పదం **బొద్దు** అక్షరాలలో (Bold Letters) లేదు, అంటే మానవాత్మనే సూచిస్తోందని అర్థం. ఆ పదానికి అర్థం చూసినట్లయితే ఆత్మద్వారా లేదా ఆత్మసంబంధమైన అనే అర్థాలు వస్తాయి. ఇక్కడ పై మూడు పదాల అర్థాలను ఉపయోగించి వాక్యమును పునర్నిర్మించినట్లయితే;

**ఆత్మతోను - ఆత్మద్వారా లేదా ఆత్మ సంబంధమైన**
**సత్యముతోను - వాక్యము ద్వారా లేదా యేసు క్రీస్తు ద్వారా**
**ఆరాధించడం - బలులు అర్పించడం**

అంటే ఆత్మద్వారా లేదా ఆత్మ సంబంధమైన, వాక్యము ద్వారా లేదా యేసు క్రీస్తు ద్వారా బలులు అర్పించడం.

## దీనికి సంబంధించిన సమభావ లేఖనాలు

ఇలాంటి భావంతో ఉన్నటువంటి వాక్యం మనకు 1పేతురు 2వ అధ్యాయములో కనిపిస్తుంది.

1పేతురు 2:5- "**యేసు క్రీస్తు ద్వారా** దేవునికి అనుకూలములగు **ఆత్మసంబంధమైన బలుల నర్పించుటకు** పరిశుద్ధ యాజకులుగా ఉండునట్లు, మీరును సజీవమైన రాళ్లవలె నుండి ఆత్మ సంబంధమైన మందిరముగా కట్టబడుచున్నారు."

పై వచనములో మనం వెదుకుతున్న పదాల నుపయోగించి అర్థవంతమైన వచనాన్ని పేతురు ద్వారా దేవుడు చెప్పించాడు. యోహాను 4:24కు సమభావముగల లేఖనము ఖచ్చితముగా 1పేతురు 2:5 వచనమే. ఇప్పుడు పేతురు చెప్పిన వచనాన్ని ఆధారం చేసుకొని యోహాను 4:24కు అర్థం చెప్పుకున్నట్లయితే,

యోహాను 4:24- ***"దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధింపవలెనని"*** అంటే అర్థం, "దేవుడు **ఆత్మ** గనుక ఆయనను ఆరాధించువారు **యేసుక్రీస్తు ద్వారా ఆత్మసంబంధమైన బలులనర్పింపవలెనని**". నిస్సందేహంగా యేసు ప్రభువు సమరయ స్త్రీతో చెప్పిన విషయాన్ని ఇక్కడ మనకు పేతురు వివరిస్తూ చెబుతున్నాడు. మీకేమన్నా సందేహంగా ఉంటే ప్రార్థనా పూర్వకంగా మరియొకసారి పైన చెప్పబడిన వచనాలన్నింటిని చదవండి.

## ఆత్మసంబంధమైన బలులనెలా అర్పించడం?

ఇప్పుడు మనం తెలుసుకోవాల్సిన విషయం ఏమిటంటే, **'యేసు క్రీస్తు ద్వారా ఆత్మసంబంధమైన బలులనెలా అర్పించడం'** అని. అసలు బలులు అర్పించడమనేది యాజకులైన లేవీయులు మాత్రమే చేయదగిన పని గదా!

సంఖ్యాకాండము 18:6,7 -"ఇదిగో నేను ఇశ్రాయేలీయుల మధ్యనుండి లేవీయులైన మీ సహోదరులను తీసికొని యున్నాను; ప్రత్యక్షపు గుడారము యొక్క సేవచేయుటకు వారు యెహోవా వలన మీ కప్పగింపబడియున్నారు. కాబట్టి నీవును నీ కుమారులును బలిపీఠపు పనులన్నిటి విషయములోను అడ్డతెరలోపలి దాని విషయములోను **యాజకత్వము** జరుపుచు సేవచేయవలెను. దయచేతనే మీ యాజకత్వపు సేవ నేను మీకిచ్చియున్నాను; **అన్యుడు సమీపించినయెడల** మరణశిక్ష నొందును."

యాజకత్వపు సేవ అనేది కేవలం లేవీయులకు మాత్రమే, దయచేతనే దేవుడు అనుగ్రహించాడు.

అయితే మరొకసారి 1పేతురు 2:5 వచనాన్ని గమనించి నట్లయితే;

1పేతురు 2:5- "యేసు క్రీస్తు ద్వారా దేవునికి అనుకూలములగు ఆత్మసంబంధమైన బలులనర్పించుటకు **పరిశుద్ధ యాజకులుగా** ఉండునట్లు, మీరును సజీవమైన రాళ్లవలె నుండి ఆత్మ సంబంధమైన మందిరముగా కట్టబడుచున్నారు."

మనల్ని 'పరిశుద్ధ యాజకులు' అని పేతురు సంబోధిస్తున్నాడు. పేతురు మనల్ని యాజకులు అనడమేమిటి? యాజకులు కేవలం **'లేవీయులు'** మాత్రమే కదా!

అవును గానీ, దేవుడు తన కృపను బట్టి మన అందరినీ యాజకులనుగా చేశాడు. మొదటి పేతురు పత్రికలోని ఈక్రింది వచనం చూడండి;

1పేతురు 2:9 –"అయితే మీరు చీకటిలో నుండి ఆశ్చర్యకరమైన తన వెలుగులోనికి మిమ్మును పిలిచిన వాని గుణాతిశయములను ప్రచురముచేయు నిమిత్తము, ఏర్పరచబడిన వంశమును, రాజులైన **యాజక సమూహమును**, పరిశుద్ధ జనమును, దేవుని సొత్తయిన ప్రజలునైయున్నారు."

లేవీయులు కానట్టి, అసలు యూదులే కానట్టి మనల్ని దేవుడు తనకు యాజకులనుగా చేసుకున్నాడు.

అంతేగాకుండా అహరోను సంతతిలో గాకుండా యేసు ప్రభువు మెల్కీసెదెకు క్రమములో **ప్రధానయాజకుడని** పిలువబడ్డాడు.

హెబ్రీయులకు 5:9,10 –"మరియు ఆయన సంపూర్ణసిద్ధి పొందినవాడై, మెల్కీసెదెకు యొక్క క్రమములో చేరిన **ప్రధానయాజకుడని** దేవునిచేత పిలువబడి, తనకు విధేయులైన వారికందరికిని నిత్య రక్షణకు కారకుడాయెను."

హెబ్రీ 7:14 –"మన ప్రభువు యూదా సంతానమందు జన్మించెననుట స్పష్టమే; ఆ గోత్ర విషయములో యాజకులను గూర్చి మోషే యేమియు చెప్పలేదు."

హెబ్రీయులకు 7:12 –"ఇదియుగాక యాజకులు మార్చబడినయెడల అవశ్యకముగా **యాజక ధర్మము సహామార్చబడును.**"

అంటే ప్రధాన యాజకుడు, యాజకులు మార్చబడ్డారు, తద్వారా యాజక ధర్మం కూడా మార్చబడినది. లేవీయులు గొర్రెలు, మేకలు, పెయ్యలను బలిగా అర్పించారు. కాని మనం మార్చబడిన మన యాజక ధర్మం చొప్పున **యేసు క్రీస్తు ద్వారా ఆత్మసంబంధమైన బలులను అర్పించాలి.**

అదెలాగో తెలుసుకోవడానికి రోమీయులకు రాసిన పత్రిక 15వ అధ్యాయములో ఈ క్రింది వచనాలు చదువుదాం;

రోమా 15:15,16– "అయినను **అన్యజనులు అను అర్పణ** పరిశుద్ధాత్మ వలన పరిశుద్ధపరచబడి ప్రీతికరమగునట్లు, నేను **సువార్త** విషయమై **యాజక ధర్మము** జరిగించుచు, దేవునిచేత నాకు అనుగ్రహింపబడిన కృపను బట్టి, అన్యజనుల నిమిత్తము యేసు క్రీస్తు పరిచారకుడనైతిని."

పై వచనము ఖచ్చితముగా పేతురు చెప్పిన వచనాన్ని వివరిస్తుందని చెప్పవచ్చును. మన యాజకధర్మం ప్రకారం యేసు క్రీస్తు ప్రభువుల వారి సువార్త ప్రకటించడం ద్వారా అన్యజనులు అను అర్పణ అంటే ఆత్మసంబంధమైన బలులు అర్పించడమే ఆత్మతోను సత్యముతోను ఆరాధించడం. అంటే క్లుప్తంగా చెప్పాలంటే **'సువార్త'** ప్రకటించి అన్యజనులను దేవుని యొద్దకు తీసుకురావడమే... **ఆత్మతోను సత్యముతోను ఆరాధించడం.** దయచేసి ప్రార్థనా పూర్వకంగా మరొకసారి **ధ్యానించండి!**

## తన్ను ఆరాధించువారు అట్టివారే కావలెనని తండ్రి కోరుచున్నాడు :

ఇపుడు మరల ఒకసారి యోహాను 4:21 చదువుదాం;

"–అమ్మా, ఒక కాలము వచ్చుచున్నది, ఆ కాలమందు ఈ పర్వతము మీదనైనను యెరూషలేములోనైనను మీరు తండ్రిని ఆరాధింపరు. నా మాట నమ్ముము" అని యేసు ప్రభువు చెబుతున్నాడు. అంటే యేసు ప్రభువు సమరయ స్త్రీతో మాట్లాడుతున్న ఆ కాలములో సమరయులు గెరిజీము పర్వతము మీదను యూదులు యెరుషలేములోనూ ఆరాధిస్తున్నారు. సమరయులు పర్వతము మీదను, యూదులు యెరుషలేములోను ఏవిధంగా ఆరాధిస్తారో మనకు తెలిసిన విషయమే! కోడెలు, మేకలు, పొట్టేళ్లను బలియివ్వడం.

అయితే, ఒకసారి యోహాను 4:23లో చూడండి, 'అయితే యథార్థముగా ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను తండ్రిని ఆరాధించు కాలము వచ్చుచున్నది; అది ఇప్పుడును వచ్చేయున్నది; తన్ను ఆరాధించువారు అట్టివారే కావలెనని తండ్రి కోరుచున్నాడు' అని సమరయ స్త్రీతో చెబుతున్నాడు.

అంటే అప్పటి వరకు ఏదైతే సమరయులు మరియు యూదులు ఆరాధిస్తున్నారో అలా కాకుండా 'ఆత్మతోను సత్యముతోను ఆరాధించు కాలము వస్తుందని, వచ్చేయున్నదని మరియు అట్టి వారే కావాలని' అంటున్నాడు. ఇక్కడ జాగ్రత్తగా గమనించండి! **అట్టివారే కావాలంటున్నాడంటే ఇప్పుడు యూదులు ఆరాధించే విధానాన్ని వద్దంటున్నట్లే కదా!** మరి ఎందుకని వద్దంటున్నాడు, "దేవుడు **ఆత్మ** గనుక ఆయనను

ఆరాధించు వారు ఆత్మతోను సత్యముతోను ఆరాధింపవలెను" అని చెబుతున్నాడు. 'దేవుడు **ఆత్మ** గనుక' అని నొక్కి చెబుతూ, ప్రస్తుతం వారు అర్పిస్తున్న కోడెలు, పొట్టేళ్ల బల్యర్పణలను వద్దంటున్నాడంటే, మరి దేవుడు ఎలాంటి బల్యర్పణ కోరుతున్నాడు? అయితే ఈ బల్యర్పణలను వద్దని ఇప్పుడు కొత్తగా చెప్పలేదు. యూదులు దేవుని మాట లెక్క చేయకుండా, దేవున్ని విసిగించిన ప్రతిసారి బల్యర్పణలు తనకు ఇష్టంలేదని బలులు అర్పించుట కంటే మాట వినుట శ్రేష్టమని (1సమూ 15:22) చెబుతూనే ఉన్నాడు. ఒకసారి ఈ క్రింది వచనాలు కూడా చదవండి;

యెషయా 1:11 –"యెహోవా సెలవిచ్చిన మాట ఇదే –విస్తారమైన మీ బలులు నాకేల? దహనబలులగు పొట్టేళ్లను బాగుగా మేపిన దూడల క్రొవ్వును నాకు వెక్కసమాయెను కోడెల రక్తమందైనను గొఱ్ఱెపిల్లల రక్తమందైనను మేకపోతుల రక్తమందైనను నాకిష్టము లేదు."

కీర్తనలు 50:8–13 –"నీ బలుల విషయమై నేను నిన్ను గద్దించుటలేదు నీ దహనబలులు నిత్యము నాయెదుట కనబడుచున్నవి. నీ యింటనుండి కోడెనైనను నీ మందలోనుండి పొట్టేళ్లనైనను నేను తీసికొనను. అడవిమృగములన్నియు వేయికొండలమీది పశువులన్నియు నావేగదా, కొండలలోని పక్షులన్నిటిని నేనెరుగుదును పొలములలోని పశ్వాదులు నా వశమై యున్నవి. లోకమును దాని పరిపూర్ణతయు నావే. నేను ఆకలిగొనినను నీతో చెప్పను. వృషభముల మాంసము నేను తిందునా? పొట్టేళ్ల రక్తము త్రాగుదునా?"

హోషేయ 6:6 –"నేను బలిని కోరను గాని కనికరమునే కోరుచున్నాను, **దహనబలులకంటె దేవుని గూర్చిన జ్ఞానము నాకిష్టమైనది."**

హెబ్రీ 10:4 –"ఏలయనగా ఎడ్ల యొక్కయు మేకల యొక్కయు రక్తము పాపములను తీసివేయుట అసాధ్యము,"

హెబ్రీ 10:8–10 –"–బలులు అర్పణలు పూర్ణహోమములు పాపపరిహారార్థ బలులును నీవు కోరలేదనియు, అవి నీకిష్టమైనవి కావనియు పైని చెప్పిన తరువాత, ఆయన –నీ చిత్తము నెరవేర్చుటకు ఇదిగో నేను వచ్చియున్నానని చెప్పుచున్నాడు. ఇవన్నియు ధర్మశాస్త్రము చొప్పున అర్పింపబడుచున్నవి. ఆ రెండవదానిని స్థిరపరచుటకు మొదటి దానిని కొట్టివేయుచున్నాడు. యేసుక్రీస్తు యొక్క శరీరము ఒక్కసారియే అర్పింపబడుట చేత ఆ చిత్తమును బట్టి మనము పరిశుద్ధపరచబడి యున్నాము."

హెబ్రీ 10:19–22 –"సహోదరులారా, యేసు మన కొరకు ప్రతిష్ఠించిన మార్గమున, అనగా నూతనమైనదియు, జీవముగలదియు, ఆయన శరీరము అను తెరద్వారా యేర్పరచబడినదియునైన మార్గమున, ఆయన రక్తము వలన పరిశుద్ధ స్థలమునందు ప్రవేశించుటకు మనకు ధైర్యము కలిగియున్నది గనుకను, దేవుని ఇంటిపైన మనకు గొప్ప యాజకుడున్నాడు గనుకను, మనస్సాక్షికి కల్మషము తోచకుండునట్లు ప్రోక్షింపబడిన హృదయములు గల వారమును, నిర్మలమైన ఉదకముతో స్నానము చేసిన శరీరములు గలవారమునైయుండి, విశ్వాస విషయములో సంపూర్ణ నిశ్చయత కలిగి, యథార్థమైన హృదయముతో మనము దేవుని సన్నిధానమునకు చేరుదము."

బలులు అర్పణలు దేవుడు కోరడంలేదని, అవి పాపమును తీసివేయలేవని తెలియజేస్తూ, యేసుక్రీస్తు తన్ను తానే బలిగా అర్పించుకొని, తన రక్తము ద్వారా దేవుని సన్నిధికి చేరుకోడానికి ఒక నూతనమైన మార్గమును ప్రభువు సిద్ధపరచాడని పై వచనాలు తెలియజేస్తున్నాయి.

యేసుప్రభువు తన్ను తాను రిక్తునిగా చేసుకొని, పరలోకం వీడి శరీరధారియై మనమధ్య నివసించి, తన్ను తానే బలిగా అర్పించుకొని మన కొరకు రక్షణ మార్గాన్ని సిద్ధపరచడం అనేది అత్యంత ప్రాముఖ్యమైన విషయం కాదా! ఆ విషయాన్ని అందరికి తెలియజేయడం మన విధి కాదా!

అందుకే అట్టి వారే కావాలని ప్రభువు నొక్కి చెబుతున్నాడు. అంటే ఆత్మతో సత్యముతో ఆరాధించేవారిని అనగా ప్రభువు సిద్ధపరచిన మార్గమును తెలియపరిచే వారిని దేవుడు కోరుకుంటున్నాడు.

## సమరయ స్త్రీ స్పందన చూడండి :

యోహాను 4:25–34: "ఆ స్త్రీ ఆయనతో –క్రీస్తనబడిన మెస్సీయ వచ్చునని నేనెరుగుదును; ఆయన వచ్చినప్పుడు మాకు సమస్తమును తెలియజేయునని చెప్పగా, యేసు – నీతో మాటలాడుచున్న నేనే ఆయనని ఆమెతో చెప్పెను.

ఇంతలో ఆయన శిష్యులు వచ్చి ఆయన స్త్రీతో మాటలాడుట చూచి ఆశ్చర్యపడిరి గాని నీకేమి కావలెననియైనను, ఈమెతో ఎందుకు మాటలాడు చున్నావని యైనను ఎవడును అడుగలేదు. ఆ స్త్రీ తనకుండ విడిచిపెట్టి ఊరిలోనికి వెళ్లి, –మీరు వచ్చి, నేను చేసిన వన్నియు నాతో చెప్పిన మనుష్యుని చూడుడి; ఈయన క్రీస్తుకాడా అని ఆ ఊరివారితో చెప్పగా, వారు ఊరిలోనుండి బయలుదేరి ఆయనయొద్దకు వచ్చుచుండిరి. ఆలోగా శిష్యులు –బోధకుడా, భోజనము చేయుమని ఆయనను వేడుకొనిరి. అందుకాయన –భుజించుటకు మీకు తెలియని ఆహారము నాకు ఉన్నదని వారితో చెప్పగా, శిష్యులు –ఆయన భుజించుటకు ఎవడైననేమైనను తెచ్చెనేమో అని యొకనితో ఒకడు చెప్పు కొనిరి. **యేసు వారిని చూచి –నన్ను పంపినవాని చిత్తము నెరవేర్చుటయు, ఆయన పని తుదముట్టించుటయు నాకు ఆహారమై యున్నది.**"



క్రీస్తు గురించి ఆ ఊరివారితో చెబుతున్న సమరయ స్త్రీ

యోహాను 4:39–42: "–నేను చేసినవన్నియు నాతో చెప్పెనని సాక్ష్య మిచ్చిన స్త్రీయొక్క మాటనుబట్టి ఆ ఊరిలోని సమరయులలో అనేకులు ఆయనయందు విశ్వాసముంచిరి. ఆ సమరయులు ఆయనయొద్దకు వచ్చి, తమయొద్ద ఉండుమని ఆయనను వేడుకొనిరి గనుక ఆయన అక్కడ రెండు దినములుండెను. ఆయన మాటలు వినినందున ఇంకను అనేకులు నమ్మి ఆ స్త్రీని చూచి –ఇకమీదట నీవు చెప్పిన మాటనుబట్టి కాక, మా మట్టుకు మేము విని, ఈయన నిజముగా లోకరక్షకుడని తెలిసికొని నమ్ముచున్నామనిరి."

**దేవునికి మహిమకలుగును గాకా!**

మరి మనం నిజంగా **ఆత్మతో సత్యముతో దేవుని ఆరాధిస్తున్నామా?** ఇట్టి ఆరాధన అనగా సువార్త పరిచర్య అందరూ చేయవలసినది కాదా? ఇట్టి పరిచర్య సంఘములో చేయదగినదా? లేక అన్యజనుల మధ్య చేయదగినదా? ఆలోచించండి!

**Your story is the key that can unlock someone else's prison**

**Share your testimony**

### మరో ముఖ్య విషయం :

అయితే ఆరాధించడానికి వాక్యానుసారమైన ఇతర పద్ధతులు కూడా ఉన్నాయి. ఈ సందర్భంగా వాటి గురించి కూడా ధ్యానిద్దాం. వాక్యానుసారంగా ఆరాధించడం అంటే **'బల్యర్పణ'** అని తెలుసుకున్నాము కదా. బైబిల్లో ఆ పదానికి ఇతర పర్యాయపదాలు చూసినట్లయితే **'యాగము'** అనే అర్థం కూడా చెప్పబడింది.

1పేతురు 2:5 వచనములో **'బలులు'** అనే పదానికి ఏదైతే గ్రీకు పదము {**G(2378)** θυσία, — *thoo-see'-ah*} ఉపయోగించబడిందో అదే పదానికి కొన్ని వేరే చోట్ల తెలుగులో **'యాగము'** అనే పదము ఉపయోగించబడింది. ఆంగ్ల తర్జుమాలో ఈ కన్ఫ్యూజన్ ఉండదు. అన్ని చోట్లా 'SACRIFICE' అనే పదమే వాడబడింది.

**G(2378)** θυσία, — *thoo-see'-ah*; from **(2380)** (θύω); *sacrifice* (the act or the victim, literal or figurative): — sacrifice.

అలాంటి పదాలతో ఉన్న ఇతర వచనాలను ఒకసారి గమనిద్దాం. రోమీయులకు వ్రాసిన పత్రిక 12వ అధ్యాయం ఒకసారి చూద్దాం;

రోమా 12:1–2 "కాబట్టి సహోదరులారా, పరిశుద్ధమును దేవునికి అనుకూలమునైన **సజీవ యాగముగా** మీ శరీరములను ఆయనకు సమర్పించుకొనుడని దేవుని వాత్సల్యమును బట్టి మిమ్మును బతిమాలుకొనుచున్నాను. **ఇట్టి సేవ మీకు యుక్తమైనది.** మీరు ఈ లోక మర్యాదను అనుసరింపక, ఉత్తమమును, అనుకూలమును, సంపూర్ణమునై యున్న దేవుని చిత్తమేదో పరీక్షించి తెలిసికొనునట్లు మీ మనస్సు మారి నూతనమగుటవలన రూపాంతరము పొందుడి."




అలాగే ఫిలిప్పీయులకు వ్రాసిన పత్రిక 4వ అధ్యాయము చదువుదాం;

ఫిలిప్పీ 4:15– "ఫిలిప్పీయులారా, సువార్తను నేను బోధింప నారంభించి మాసిదోనియలో నుండి వచ్చినపుడు ఇచ్చు విషయములోను పుచ్చుకొను విషయములోను మీరు తప్ప మరి ఏ సంఘపు వారును నాతో పాలివారు కాలేదని మీకు తెలియును. ఏలయనగా థెస్సలొనీకలో కూడా మీరు మాటిమాటికి నా అవసరము తీర్చుటకు సహాయము చేసితిరి. నేను యీవిని అపేక్షించి యీలాగు చెప్పుటలేదు గాని మీ లెక్కకు విస్తారఫలము రావలెనని అపేక్షించి చెప్పుచున్నాను. నాకు సమస్తమును సమృద్ధిగా కలిగియున్నది. మీరు పంపిన వస్తువులు ఎపఫ్రొదితు వలన పుచ్చుకొని యేమియు తక్కువలేక యున్నాను. అవి మనోహరమైన సువాసనయు, **దేవునికి ప్రీతికరమును ఇష్టమునైన యాగమునై** యున్నవి."

అందుకే పౌలు ఇలా అన్నాడు, ***"పరిశుద్ధుల అవసరములలో పాలుపొందుచు, శ్రద్ధగా ఆతిథ్యము ఇచ్చుచుండుడి"*** (రోమా 12:13).

అంతేగాకుండా, హెబ్రీయులకు వ్రాసిన పత్రిక 13వ అధ్యాయము ఈ క్రింది వచనాలు చదువుదాం;

హెబ్రీ 13:15,16– "కాబట్టి ఆయనద్వారా మనము దేవునికి ఎల్లప్పుడును **స్తుతియాగము** చేయుదము, అనగా ఆయన నామమును ఒప్పుకొనుచు, **జిహ్వా ఫలము** అర్పించుదము. **ఉపకారమును ధర్మమును** చేయమరచిపోకుడి, అట్టి **యాగములు దేవునికిష్టమైనవి."**

పైన చెప్పబడిన వచనాల సారాంశమేమనగా, మన స్వచిత్తానుసారముగా గాకుండా దేవుని చిత్తాన్ని వెంబడించడం, దేవునికి ఎల్లప్పుడూ కృతజ్ఞతా స్తుతులు చెల్లించడం, మన సహోదరుల అవసరతలలో పాలుపంపులు పొందడం, ఆతిథ్యము ఇవ్వడం, ఇతరులకు ఉపకారము, ధర్మము చేయడము– ఇవే వాక్యానుసారమైన దేవున్ని ఆరాధించే విధానములు.

**మరి మనం ఏం చేస్తున్నామో ఎక్కడ తప్పిపోతున్నామో ఒకసారి మనల్ని మనం విమర్శించుకొని వాక్యానుసారముగా జీవిద్దాం.**

## రాబోయే సంచికలలో...

- **బైబిల్ సర్వే**
  బైబిల్‌లోని 66 పుస్తకాల గురించి సమగ్ర విశ్లేషణ, అధనపు సమాచారము తెలుసుకుందాం!
- **ప్రత్యేక శీర్షికలు**
  సువార్తకు ఆటంకాలు కలిగించే అంశాలు, క్రైస్తవ్యంపై ద్వేషానికి గల కారణాలు తదితర అంశాల గురించి తెలుసుకుందాం!
- **క్రైస్తవ పండుగలు**
  ఈస్టర్, క్రిస్మస్ పండుగల గురించిన వాస్తవాలను విశ్లేషించుకుందాం!
- **యూదుల పండుగలు**
  యెహోవా దేవుడు యూదుల కొరకు ఏర్పాటుచేసిన పండుగల గురించి వాటి విశిష్టత గురించి తెలుసుకుందాం!
- **క్రైస్తవ చరిత్రలో ముఖ్యమైన ఘట్టాలు**
  క్రీ.శ. మొదటి శతాబ్దం నుండి ఇప్పటి వరకు క్రిస్టియానిటీలో జరిగిన ముఖ్యమైన ఘట్టాల గురించి తెలుసుకుందాం!
- **బయోగ్రఫికల్ స్టడీస్**
  అబ్రహాము, మోషే, ఇస్సాకు, యాకోబు, దావీదు, సొలోమోను మొదలగువారి జీవితాల గురించి చదువుకుందాం!
- **ఇతర మత అధ్యయనాలు**
  హిందూమతం, ఇస్లాం మతం, యూదా మతం గురించి అధ్యయనం చేద్దాం!

**–ఎడిటర్**

# COVER STORY




## Jacob's Well in West Bank

*Jacob's Well, where Jesus asked a Samaritan woman for a drink and offered her "living water", lies in the crypt of a modern Greek Orthodox church at Nablus in the West Bank.*

*It is often considered the most authentic site in the Holy Land — since no one can move a well that was originally more than 40 metres deep.*

*Jewish, Samaritan, Christian and Muslim traditions all associate the well with Jacob.*

*The location, at the entrance to a mountain pass between Mount Gerizim and Mount Ebal, is 2km east of Nablus. It is near the archaeological site of Tell Balata — thought to be the biblical Shechem — and about 63km north of Jerusalem.*

*It was at Shechem that the patriarch Jacob bought "the land on which he had pitched his tent" (Genesis 33:19).*

*The Samaritan woman reminded Jesus that Jacob "gave us the well, and with his sons and his flocks drank from it". He told her he was the promised Messiah, and she and many residents of her village believed in him. (John 4:5-42)*



### *Samaritan woman venerated as martyr*

*Access to Jacob's Well is by entering the Church of St Photina and descending stairs in front of the iconostasis to the crypt.*

*Photina (Svetlana in Russian) is the name Orthodox tradition has given to the Samaritan woman. She is venerated as a martyr who was flayed alive and thrown down a well in Rome by the emperor Nero.*



*the Church of St Photina, Greek Orthodox church at Nablus in the West Bank*

*A masonry structure surrounds the mouth of the well. On it stands a metal-framed pulley with a coil of rope long enough to reach the water.*

*A neck section about 50cm across and 1.2 metres deep opens into a shaft about 2.5 metres in diameter, hewn through solid rock.*

*Though the Samaritan woman told Jesus "the well is deep" (John 4:11), measurements of the depth have varied over the years, due to accumulation of debris (and stones dropped by curious visitors).*

*A depth of more than 40 metres recorded in 1935 had reduced to something over 20 metres by the 21st century. In ancient times the well was sunk much deeper, probably twice as far.*

*At times Jacob's Well has been dry in summer.*

## Samaria was a 'no-go' area

*Because of friction between Jews and Samaritans, the territory of Samaria was usually a "no-go" area for Galileans travelling to or from Jerusalem.*

*The Gospel of Luke (9:51-55) tells of a Samaritan village that refused to receive Jesus because he was going to Jerusalem (on that occasion two of his disciples wanted to bring fire from heaven down on the village).*

*Samaritans have their origins in Judaism but, as the woman at the well pointed out to Jesus (John 4:20), they worship on Mount Gerizim rather than in Jerusalem.*

*They also regard Moses as the only prophet and accept only the first five books of the Old Testament (the Books of Moses, or the Torah).*

*The Samaritans at one time numbered in the hundreds of thousands but by 2007 only 700 remained, living mostly at Mount Gerizim and near Tel Aviv.*

## Succession of churches on the site

*Pilgrims' writings refer to Christian veneration of Jacob's Well from the 3rd century. The earliest source, the anonymous Pilgrim of Bordeaux, mentions a bath (presumed to be a baptistry) that took its water from the well.*

*A cruciform church built around 380 was the first of a succession of churches erected over the well. One of them appears in the 6th-century Madaba mosaic map.*

*In 1860 the Greek Orthodox Church acquired the property and began restoring the crypt. Construction of a new church was hindered by the 1917 Russian Revolution, which halted Russian funding, and by an earthquake in 1927.*

*The present church, completed in 2007, is modelled on a basilica from the Crusader era. In an attractive setting of trees and pot plants, it is well-lit, spacious and airy — a contrast to older Orthodox churches in the Holy Land.*

*Framed icons in modern style and bright colours are fixed to walls and ceilings, rather than being rendered on to these surfaces.*

## Place of conflict and violence

*Nablus was an arena of conflict between militant Palestinians and the Israel Defence Force during the Second Intifada, between 2000 and 2005, but has since rebuilt itself as an industrial and commercial centre.*

*Jacob's Well has also been a site of contention and violence. In 1979 a Zionist group claimed it as a Jewish holy place and demanded that crosses and icons be removed. A week later the custodian, Archimandrite Philoumenos, was butchered to death in the crypt and the church was desecrated. No one was ever convicted of his murder.*

*The remains of Archimandrite Philoumenos are venerated in the right-hand chapel of the Church of St Photina.*

*North of Jacob's Well is a related site, Joseph's Tomb. This white-domed tomb is believed to be where the bones of Jacob's son Joseph were buried after being brought back from Egypt (Joshua 24:32).*



*Source : seetheholyland.net*




# మీకు తెలుసా

## దేవునికి రాసిన ఉత్తరాలు.....

**ప్రపంచం నలుమూలల నుండి ప్రతి సంవత్సరం 1000 కన్నా ఎక్కువ ఉత్తరాలు దేవుని అడ్రస్‌తో ఇజ్రాయెల్‌లోని జెరూసలేం నగరానికి చేరుకుంటాయని మీకు తెలుసా?**

అవును, దేవుని చిరునామాతో ఇజ్రాయేల్‌కు చాలా ఉత్తరాలు వస్తుంటాయి. ఇలాంటి ఉత్తరాలపై ప్రత్యేక శ్రద్ధను చూపిన ఇజ్రాయెల్ పోస్టల్ సర్వీస్ ఒక దేవుని విభాగాన్ని ఏర్పాటుచేసింది. ఇలాంటి ఉత్తరాలు ఒక సీనియర్ రబ్బీ పర్యవేక్షణలో రెండు మూడు నెలలకు ఒకసారి తెరవబడి యెరుషలేములోని ఓల్డ్ సిటీలోని వెస్టర్న్ వాల్ పగుళ్ల సందుల్లో దూర్చబడి, వాటి కొరకు ప్రార్థనలు చేయబడతాయి.

ప్రపంచంలోని వివిధ దేశాలలోని యూదుల నుండి, క్రైస్తవుల నుండి అంతేగాకుండా ఇతర మతస్తుల నుండి కూడా దేవునికి ఉత్తరాలు వస్తూంటాయి. 'దేవుడు, జెరూసలేం, ఇజ్రాయేల్' అని, 'ప్రియమైన దేవుడు, వెస్టర్న్ వాల్, ఇశ్రాయేల్' అని, 'రబీ జీసస్, టెల్అవీవ్' అని ఇలా దేవుని అడ్రస్‌తో కూడిన ఉత్తరాలు వస్తుంటాయి. ఒకతను ఆంగ్లములో ***Mr. Christ, C/o Jerusalem, Israel*** అనే చిరునామాతో ఉత్తరం వ్రాసిపంపాడు. మరికొందరు వారి దేశాల భాషలలో అంటే, రష్యన్ భాషలో, జర్మన్ భాషలో, ఫ్రెంచ్ భాషలో రాసి పంపుతుంటారు. గాట్, క్లాగేమౌర్, జెరూసలేం అని, డియోస్, మురో డి లాస్ లామెంటోస్, జెరూసలేం అని, లా టెర్రే -సెయింట్ అని, ది కల్ట్ ఆఫ్ కాలేబ్స్, ఇజ్రాయేల్ అని పంపుతుంటారు. మరొకటి ఇండోనేషియా నుండి 'శకివంతమైౖ యెహోవా ఎలోహిమ్, జెరూసలేం, ఇజ్రాయేల్ అనే చిరునామాతో ఉత్తరం వచ్చింది.

చాలా మంది తమ హృదయంలోని నిరాశ, ఒత్తిడి, వేదనల వలన, మరికొంత మంది మతపరమైన భక్తితో ఇలాంటి ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు. ఒకరు **'తమ కుటుంబ సభ్యుడిని స్వస్థపరచమని'**, మరొకరు **'ఇజ్రాయెల్ మరియు అరబ్ దేశాల మధ్య శాంతి నెలకొల్పమని'** అడుగుతారు. కొందరు భౌతిక వస్తువులను కోరుకుంటారు. కొందరు మంచి భార్య, ఉద్యోగం, కారు, డబ్బు.... ఇలా అడుగుతుంటారు. ఒక వ్యక్తి, తాను దేవుని నుండి ఏమీ అడగనని, అప్పటికే ఉన్నదానికి దేవునికి కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరం వ్రాసాడు. మరొకతను, చనిపోయిన తన భార్యను కలలో చూపెట్టమని ప్రాధేయపడుతూ దేవునికి ఉత్తరం వ్రాసాడు.

రష్యా మరియు మాజీ సోవియట్ దేశాల నుండి ఎక్కువగా ఉత్తరాలు వస్తుంటాయి. అప్పుడప్పుడు జోర్డాన్ లేదా ఈజిప్ట్ నుండి, మొరాకో నుండి ఉత్తరాలు వస్తుంటాయి. కాని ఇప్పటి వరకు ఇతర అరబ్ దేశాల నుండి మాత్రం ఉత్తరాలు రాలేదు. మెక్సికో నుండి ఒకరు, బెల్జియం నుండి ఒకరు రెగ్యులర్‌గా వారానికోసారి ఉత్తరాలు రాస్తూ ఉంటారు.

ప్రతీ ఉత్తరం వెస్టర్న్ వాల్‌కు పంపబడుతుంది, గోడలోని పగుళ్లలో కొంత సేపు ఉంచబడి, కొత్త వాటి కోసం ఖాళీ చేయబడతాయి. అలా తీసేసిన వాటిని పవిత్ర మైదానంలో ఖననం చేస్తారు.

*Source : theguardian / wikipedia*

*(మిగతా 24లో...)*

చారిత్రక పరిశోధనాత్మక కథనం

# Special Story...

## మన క్యాలెండర్ ఆవిర్భావ చరిత్ర

మనం క్యాలెండర్ చూడని దినమే ఉండదు అంటే అతిశయోక్తి కాదు. మనం వ్యాపారం చేస్తున్నా, ఉద్యోగం చేస్తున్నా, వ్యవసాయం చేస్తున్నా ఏదో ఒక విధంగా క్యాలెండర్ అవసరత తప్పకుండా ఉంటుంది. అయితే ప్రపంచ వ్యాప్తంగా ప్రస్తుతం అమలులో ఉన్న క్యాలెండర్ గ్రెగోరియన్ క్యాలెండర్. దీనికంటే ముందు జూలియన్ క్యాలెండర్ అమలులో ఉండేది. ఇప్పటికీ కొన్ని దేశాలలో జూలియన్ క్యాలెండరే వాడుతున్నారు. ఇంతకీ ఈ క్యాలెండర్‌ను ఎప్పటి నుండి వాడుతున్నాము? ఈ క్యాలెండర్ ఎలా వచ్చింది? అసలు ఈ క్యాలెండర్ కథ ఏంటి? తెలుసుకుందాం!

ఇలా క్యాలెండర్ గురించి తెలుసుకోవడం ద్వారా మనం బైబిల్లోని కొన్ని అంశాలను అధ్యయనం చేయడానికి, సరియైన విధంగా అర్థం చేసుకోవడానికి ఎంతగానో ఉపయోగపడుతుంది. బైబిల్లో లేని క్రిస్మస్, ఈస్టర్, గుడ్‌ఫ్రైడే... గురించిన చారిత్రక వాస్తవాలను తెలుసుకోవడానికి అలాగే కొంతమంది వారములకు సంబంధించి చేస్తున్న బోధలలోని సత్యాసత్యాలను గ్రహించడానికి ఈ అధ్యయనం మూలపాఠంగా ఎంతగానో ఉపయోగపడుతుంది.

నిజానికి ఈ క్యాలెండర్ గురించి చెప్పాలంటే ఒక పెద్ద పుస్తకమే రాయాల్సి ఉంటుంది. కాని అన్ని విషయాలు కాకుండా మన బైబిల్ అధ్యయనానికి ఉపయోగపడే విధంగా చాలా క్లుప్తంగా చెప్పడానికి ప్రయత్నించాను. దయచేసి ఒకసారి జాగ్రత్తగా చదవండి!

(పూర్తిగా తెలుసుకోవాలంటే 'వికీపీడియాను' గాని డా॥మహీధర నళినీ మోహన్ గారు రాసిన 'కేలండర్ కథ' అనే పుస్తకమును గాని సంప్రదించండి)

### క్యాలెండర్ అంటే ఏమిటి?

నెలలోని మొదటి రోజు అనే అర్థమిచ్చే క్యాలెండే (Calendae) నుండి **'క్యాలెండర్'** అనే పదం వచ్చింది. క్యాలెండరియమ్ (Calendarium) అనే లాటిన్ పదానికి 'అకౌంట్ పుస్తకం, రిజిష్టరు' అనే అర్థమున్నది (ప్రతి నెల ఖాతాలను నిర్వహించి, అప్పులు వసూలు చేయబడతాయి). లాటిన్ పదం ఫ్రెంచ్ భాషలో క్యాలెండియర్‌గా అక్కడి నుంచి 13 శతాబ్దం వరకు ఆంగ్లంలో క్యాలెండర్‌గా స్వీకరించబడింది.

అసలు ఈ క్యాలెండర్ అనే మాటను మొట్టమొదటగా ఉపయోగించినవారు రోమనులు. అమావాస్య మరునాడు నెలవంకను చూసి, కొత్త నెల మొదలైందని తెలుసుకుని రోము నగరములోని ప్రజలను పిలిచి, తీసుకున్న అప్పుల మీద వడ్డీలు చెల్లించమని తెలిపేవారు. లాటిన్ భాషలో Calare అంటే పిలవడం అని అర్థం. కనుక నెల మొదటి రోజును కేలండ్ (Calend) అనేవారు. అప్పులు ఇవ్వడం, పుచ్చుకోవడం వంటి వివరాలు రాసుకునే అకౌంట్ పుస్తకాన్ని క్యాలెండర్ అనేవారు. అదే ఈనాటికి నెల, తేది, వారాల

సూచికగా రూపొందింది.

క్యాలెండర్‌ను తెలుగులో **'పంచాంగము'** అని అంటారు. అంటే తిథి, వార, నక్షత్ర, యోగ, కరణమనే 'పంచ' అంగములు గలది అని అర్థం. పంచాంగము అనేది చంద్రకళలను అనుసరించి ఉంటుంది. ఈ పంచాంగాలు మన బైబిల్ అధ్యయనానికి అనవసరం కాబట్టి మనం క్యాలెండర్ అనే పదాన్నే వాడుతూ మిగతా విషయాలు తెలుసుకుందాం!

## క్యాలెండర్ ఆవిర్భావం :

మొట్ట మొదట మనిషికి పగలు, రాత్రులు కలిపి ఒక రోజు అనే విషయం తప్ప మరేమి తెలియదు. పోను పోను చంద్ర కళలను గమనించడం ద్వారా మాసాలను ఏర్పాటు చేసుకున్నాడు. ప్రతి రుతువుకు తగ్గట్లుగా మాసాలకు పేర్లు పెట్టుకున్నాడు. కాని కొన్ని సంవత్సరాలకు ఆయా మాసాల్లో ఆయా రుతువులు రాకుండా జరిగిపోతున్నట్లు కనుగొన్నాడు. ఆ తరువాత సూర్యోదయ ప్రదేశాలను పరిశీలించడం ద్వారా రుతువులకు కారణం సూర్యుడని కనిపెట్టాడు. అప్పటి నుండి ఒక సంవత్సరానికి ఎన్ని రోజులు పడుతుందో అనే విషయాన్ని తెలుసుకొని దానికి అనుకూలంగా మాసాలను ఏర్పాటు చేసుకోవడం జరిగింది.

> ఆది 1:14: **"దేవుడు -పగటిని రాత్రిని వేరుపరచునట్లు ఆకాశవిశాలమందు జ్యోతులు కలుగును గాకనియు, అవి సూచనలను కాలములను దిన సంవత్సరములను సూచించుటకై యుండు గాకనియు..."**

ప్రారంభంలో సూర్యునితో సంబంధం లేకుండా మాసాలను ఏర్పాటు చేసుకున్నాడు. అలాంటి సమయంలో 10 నెలల మాస చక్రాన్ని ఉపయోగించుకున్నాడు. ఆ తరువాత రుతువులను బట్టి అది పన్నెండు నెలలుగా మార్చుకున్నాడు.

చంద్రకళలను బట్టి కేవల చాంద్రమాన కేలండర్‌ను, సూర్యగతిని బట్టి కేవల సూర్యమాన క్యాలెండర్‌ను, ఇవి రెండింటిని సమన్వయ పరచి చాంద్ర-సౌరమాన క్యాలెండర్‌లను తయారుచేశారు.

ప్రపంచమంతటా వాడుతున్న గ్రెగోరియన్ క్యాలెండర్ కేవల సూర్యమాన క్యాలెండర్. యూదులు, ముస్లింలు కేవల చాంద్రమాన క్యాలెండర్‌ను వాడుతుండగా మన భారత్‌లో చాంద్ర-సౌరమాన క్యాలెండర్‌ను వాడుతున్నాము.

## క్యాలెండర్ విభజన :

ఒకసారి క్యాలెండర్ విభజన చూద్దాం;

క్యాలెండర్ నిర్మాణంలో ప్రకృతి సిద్ధమైన విభజనలు మూడు ఉన్నాయి. అవి రోజు, నెల, సంవత్సరం. మిగిలిన విభజనలన్నీ కూడా మన సౌకర్యం కోసం ఏర్పాటు చేసుకున్నవే.

ఒక ఆయనాంతం నుండి బయలుదేరి తిరిగి అదే బిందువుకు సూర్యుడు వచ్చే సమయాన్ని సంవత్సరం అంటారు. ఇది సుమారు 365.2422 రోజులకు సమానం.

అలాగే చంద్రుడు భూమి చుట్టు తిరగడానికి పట్టే కాలాన్ని మాసం అంటారు. ఇందుకు 29.5 రోజులు పడుతుంది.

సూర్యుడు ఒక చోట నుండి బయలుదేరి (ఉదయించి) తిరిగి అదే చోటుకు వచ్చే కాలమే రోజు. రోజుకు 24 గంటలు (సరిగ్గా చెప్పాలంటే 23:56:04). రోజులో పగలు 12 గంటలు రాత్రి 12 గంటలు. సూర్యోదయం ప్రతి రోజు ఒకే సమయానికి కాకపోవడం వల్లనే అంతర్జాతీయ కాలరేఖను ఏర్పాటు చేసి రోజు అర్ధరాత్రి ప్రారంభమయ్యేలా నిర్ణయించారు.

గంటను 60 నిమిషాలుగా, నిమిషాలను 60 సెకండ్లుగా బాబిలోనియన్లు విడదీసారు. ఆ విధానాన్నే ఇప్పుడు ప్రపంచమంతా అనుసరిస్తోంది.

నెలలు వారాలుగా విభజించబడ్డాయి. మనం వారం అనగా 7 రోజులు అనే అర్థంలో వాడతాము. అయితే చరిత్రలో 4 రోజులు, 5 రోజులు, 6 రోజులు, 7 రోజులు, 8 రోజులు, 10 రోజులు గల వారాలు కూడా వాడుకలో ఉండేవి. పూర్వకాలం సంతలు నిర్వహించడం ద్వారా వారాలు ఏర్పడ్డాయి. అందుకే ఇప్పటికి కూడా వార సంత అంటారు. అంటే 4 రోజులకు లేదా 8 రోజులకు లేదా 7 రోజులకు ఒకసారి సంతను నిర్వహించుకునే వారు. అదే కాలక్రమేణా వారాలుగా మారిపోయింది. కాని బాబిలోనియన్లు వాడుకున్న 7 రోజుల వారమే ప్రస్తుతం ప్రపంచమంతటా వాడుకలో ఉ

ంది. నాలుగు వారాల తర్వాత వచ్చే రోజులను వార రహితంగా వదిలేసేవారు. లీపు సంవత్సరములో ఫిబ్రవరిలో వచ్చే అధనపు రోజుకు 28వ తేదీకి ఉండే వారాన్నే ఉపయోగించేవారు. అంటే ఈ రోజు 28వ తారీఖు శనివారం అయితే రేపు, ఎల్లుండి ఎలాంటి వారాల పేర్లు ఉండవు, తిరిగి 1వ తారీఖు ఆదివారం వస్తుంది. నిజానికి మంగళవారం కావాలి. **దీన్ని బట్టి చూస్తే ఈ రోజు ఏ వారమో ఖచ్చితంగా చెప్పడం కష్టం. ఎందుకంటే కొన్ని రోజులు ఎలాంటి వారాలు లేకుండానే గడిచిపోయాయి కాబట్టి.**

గలతీ 4:10-11: **"మీరు దినములను, మాసములను, ఉత్సవకాలములను, సంవత్సరములను ఆచరించుచున్నారు. మీ విషయమై నేను పడిన కష్టము వ్యర్థమై పోవునేమో అని మిమ్మును గూర్చి భయపడు చున్నాను."**

అలాగే మెసపొటేమియాలోని కల్దీయులు వారాలకు పెట్టిన సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని గ్రహాల పేర్లే ప్రస్తుతం వాడుకలో ఉన్నాయి.

యూదులు మాత్రం బాబిలోనియన్‌లు వాడుతున్న వారాల పేర్లనే కొంత మార్చి వాడుతున్నారు. యూదులు కూడా బాబిలోనియన్ల మాదిరిగానే 7 రోజుల వారాన్ని వాడి, నాలుగు వారాల తర్వాత వచ్చే 1, 2 రోజులను వార రహితంగా వదిలేసేవారు.

గతంలో రోమన్స్ కూడా 8 రోజుల వారాన్నే (nundinae) వాడేవారు. క్రీ.శ. 321లో 7 రోజులున్న వారాన్ని వాడాలని, ఆదివారం విశ్రాంతి దినంగా ఉండాలని కాన్‌స్టాంటైన్ చక్రవర్తి నిర్ణయించాడు.

కొంత కాలానికి వారరహితమైన దినాలు తీసేశారు. 7 రోజుల వార చక్రం నెలలతోనూ, సంవత్సరాలతోనూ సంబంధం లేకుండా అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్నది.

తూర్పున ఉదయించే సూర్యుడు ప్రతి రోజు ఒకే స్థానం నుండి ఉదయించకుండా కొద్ది రోజులు ఉత్తరం వైపుకు మరి కొద్ది రోజులు దక్షిణం వైపుకు జరుగుతూ ఉదయిస్తు ఉంటాడు. ఉత్తరం వైపు జరుగుతూ ఉదయించే దానిని ఉత్తరాయణం అని, దక్షిణం వైపు జరుగుతూ ఉదయించే దానిని దక్షిణాయం అని అంటారు. ఉత్తరాయణాంతం జూన్ 22 రోజున, దక్షిణాయణాంతం డిసెంబర్ 22 రోజున వస్తుంది. ఈ ఆయనాంతాల రోజులలో పగలు ఎక్కువగాను, రాత్రి తక్కువగానూ ఉంటుంది. ఒక అయణాంతం నుండి బయలుదేరి తిరిగి అదే అయణాంతానికి రావడానికి పట్టే కాలాన్నే మనం సంవత్సరమని పైన చెప్పుకున్నాము.

ఉత్తరాయణాంతానికి, దక్షిణాయణాంతానికి సరిగ్గా మధ్య సమయాలను విషువత్తులు (Equinox) అంటారు. **వసంత విషువత్తు** (Spring Equinox) మార్చి 21 రోజున, **శరద్ విషువత్తు** (Autumnal Equinox) సెప్టెంబర్ 23 రోజున వస్తుంది. ఈ రోజులలో రాత్రి పగలు సరిసమానంగా ఉంటాయి.

రుతువులు ఏర్పడడానికి కారణం సూర్యుడు. ప్రపంచంలోని అన్ని ప్రదేశాలలో సూర్యుడు ఒకే విధంగా ఉదయించడు, అస్తమించడు. ధృవప్రాంతాల్లో కొన్ని నెలలు అసలు సూర్యుడే కనిపించడు. కొన్ని నెలలు సూర్యుడు అసలు అస్తమించడు. అందుకే ఆయా దేశాలలో రుతువులు వేరే విధంగా ఉంటాయి. మన దేశంలో 6 రుతువులుగా విభజించుకున్నాము. ప్రతి రెండు చాంద్రమాస నెలలకు ఒక రుతువు మారుతుంటుంది. చైత్ర-వైశాఖాలలో వసంతం, జ్యేష్ట-ఆషాఢాలలో గ్రీష్మం (వేసవి కాలం -మార్చి నుండి జూన్), శ్రావణ-భాద్రపదాలలో వర్ష రుతువు, ఆశ్వయుజ-కార్తీకాలలో శరత్ రుతువు (వర్షాకాలం -జూలై నుండి అక్టోబర్), మార్గశిర-పుష్యములలో హేమంత రుతువు, మాఘ-ఫాల్గుణలలో శిశిర రుతువు (శీతాకాలం -నవంబర్ నుండి ఫిబ్రవరి) ఇలా ఉంటాయి.

కాని, పాశ్చాత్య దేశాల్లో నాలుగే రుతువులు ఉంటాయి. Spring (21 March - 21 June), Summer (21 June - 23 Sept), Autumn (23 Sept - 22 Dec), Winter (22 Dec - 21 March). మరికొన్ని దేశాల్లో రెండే రుతువులుంటాయి. సముద్ర ప్రాంత ప్రజలకు, ఎడారి ప్రాంత ప్రజలకు వేరు వేరు విధంగా రుతువులు ఉంటాయి. ఇశ్రాయేల్‌లో మే నుండి సెప్టెంబర్ వరకు వాతావరం పొడిగా ఉండే వేసవికాలం, అక్టోబర్ నుండి ఏప్రిల్ వరకు వాతావరణం చల్లగా ఉండే వర్షాకాలం.

## చంద్రకళలు, గ్రహణాలు :

చంద్రుడు తన చుట్టు తాను తిరుగుతూ, భూమి చుట్టూ తిరగడం వలన చంద్ర కళలు ఏర్పడుతున్నాయి. చంద్ర కళలు అంటే చంద్రుడు క్షయమొందడం, వృద్ధి చెందడం, పౌర్ణమి, అమావాస్యలు ఏర్పడడం. 15 రోజులు వృద్ధిచెందుతూ నిండుగా మారుతాడు. దీనినే మనం **'పౌర్ణమి'** అంటాము. తిరిగి 15 రోజులు క్షయమగుతూ కనుమరుగైపోతాడు. దీనినే మనం **'అమావాస్య'** అంటాము. 15 రోజులను పక్షము అంటారు. కృష్ణ పక్షము, శుక్ల పక్షము రెండు కలిస్తే ఒక మాసము అవుతుంది. నిజానికి ఈ రెండు పక్షాలు కలిపితే 30 రోజులు వుండవు, 29.5 రోజులు మాత్రమే ఉంటాయి. అందుకే చాంద్రమాసములో ఒక నెలలో 29 రోజులుంటే మరో నెలలో 30 రోజులు ఉంటాయి. మన తెలుగు క్యాలెండర్‌లో అమావాస్య తెల్లవారి కనిపించే నెలవంకను శుద్ధ పాడ్యమి అని ఆ తర్వాత విధియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్ధశి, పూర్ణిమ అని అంటారు. పౌర్ణమి తెల్లవారి నుండి మళ్లీ బహుళ పాడ్యమి, విధియలు మొదలవుతాయి 15వ రోజు అమావాస్య వస్తుంది. అమావాస్యతో నెల ముగుస్తుంది. తిరిగి పాడ్యమితో క్రొత్త నెల ప్రారంభం అవుతుంది. యూదులు, ముస్లిములు మరియు హిందువుల క్యాలండర్‌లలో మాసం ఇలా పాడ్యమి అంటే నెలవంకతో మొదలవుతుంది.

మన తెలుగు క్యాలెండర్ ప్రకారం చంద్రుడు ఆ రోజు ఏ నక్షత్రముతో ఉంటాడో ఆ రోజుకు ఆ నక్షత్రాన్ని సూచిస్తారు. మనం సాధారణంగా వివాహ పత్రికలలో చూస్తుంటాం, -స్వస్తిశ్రీ ప్లవనామ సం॥ర శ్రావణ బ॥ తదియ తేది:25-08-2021 బుధవారం ఉ॥11-11 ని॥ లకు ఉత్తరాభాద్ర నక్షత్రయుక్త కన్యాలగ్న పుష్కరాంశ సుమూహూర్తమున.... ఇందులో ప్లవ అనేది మన తెలుగు సంవత్సరాలు. ఇవి ప్రభవ, విభవ.... ఇలా 60 వుంటాయి. శ్రావణం అనేది తెలుగు మాసం పేరు. చైత్రం, వైశాఖం..... ఇలా 12 ఉంటాయి. తదియ అనేది పైన చెప్పుకున్నట్లుగా పక్షంలో మూడవ రోజు. ఉత్తరాభాద్ర అనేది ఆ రోజు చంద్రుడు ఉన్న నక్షత్రం పేరు. అవి మృగశిర, ఆరుద్ర, పునర్వసు... ఇలా మొత్తం 27 నక్షత్రాలు ఉంటాయి.

సూర్యచంద్రులు మరియు భూమి ఒకే సరళరేఖ మీద ఉండి భూమికి, సూర్యునికి మధ్యన చంద్రుడు ఉన్నప్పుడు **'సూర్యగ్రహణం'** (Solar Eclipse) ఏర్పడుతుంది. అంటే చంద్రుడు సూర్యునికి అడ్డుగా వస్తాడు కాబట్టి సూర్యుడు కాసేపు కనిపించకుండా పోతాడు. ఇది అమావాస్యనాడు మాత్రమే సంభవిస్తుంది.




అలాగే సూర్యచంద్రులు మరియు భూమి ఒకే సరళరేఖ మీద ఉండి చంద్రునికి, సూర్యునికి మధ్యన భూమి ఉన్నప్పుడు **'చంద్రగ్రహణం'** (Lunar Eclipse) ఏర్పడుతుంది. అంటే సూర్యుని వెలుగు చంద్రునిపై పడకుండా భూమి అడ్డుగా వస్తుంది, కాబట్టి చంద్రుడు కాసేపు కనిపించకుండా పోతాడు. ఇది పౌర్ణమినాడు మాత్రమే సంభవిస్తుంది.




## జూలియన్ క్యాలెండర్ :

ప్రస్తుతం ప్రపంచంలో అన్ని దేశాలలో అమలులో ఉన్న గ్రెగోరియన్ క్యాలెండర్‌కి సాక్షాత్తు తల్లిలాంటిది జూలియన్ క్యాలెండర్. ప్రఖ్యాత రోమన్ చక్రవర్తి జూలియస్ సీజర్ కృషికి గుర్తింపుగా ఆయన పేరు మీదుగా ఈ క్యాలెండర్‌కు ఆ పేరు వచ్చింది. అసలు ఈ జూలియన్ కాలేండర్ ఎలా వచ్చిందో ఒకసారి చూద్దాం!

క్రీ.పూ. 753లో రోమ్ నగరాన్ని నిర్మించిన రోములస్

చక్రవర్తి (Romulus) అదే కాలంలో 10 నెలలతో కూడిన 305 రోజులు గల క్యాలెండర్‌ను ప్రారంభించాడు. అది ఈ క్రింద విధంగా ఉన్నది.

| | | |
|---|---|---|
| మార్షియస్ (Martius) | – | 31 రోజులు |
| ఏప్రిలిస్ (Aprilis) | – | 30 రోజులు |
| మాయియస్ (Maius) | – | 31 రోజులు |
| జూనియస్ (Junius) | – | 30 రోజులు |
| క్వింటిలిస్ (Quintilis) | – | 31 రోజులు |
| సెక్స్టిలిస్ (Sextilis) | – | 30 రోజులు |
| సెప్టెంబర్ (September) | – | 30 రోజులు |
| అక్టోబర్ (October) | – | 31 రోజులు |
| నవంబర్ (November) | – | 30 రోజులు |
| డిసెంబర్ (December) | – | 31 రోజులు |

**మార్షియస్ :** మార్స్ (కుజ) గ్రహం పేరిట మొదటి నెలకు మార్షియస్ పేరు వచ్చింది. మార్స్‌ను రోమనులు యౌవనాధి దేవతగా భావిస్తారు.

**ఏప్రిలిస్ :** 'ఎపెరియో' అనే లాటిన్ పదానికి విచ్చుకొనుట అనే అర్థం ఉంది. పువ్వులు ఈ నెలలో విచ్చుకుంటాయి కనుక ఈ నెలకు ఆ పేరు వచ్చి ఉండొచ్చు.

**మాయియస్ :** కృత్తికా నక్షత్ర సముదాయంలో బహు ప్రకాశవంతమైన నక్షత్రాన్ని రోమనులు 'మేయ' అనేవారు. ఈ నక్షత్రం సూర్యునితో సహా ఈ నెలలో ఉదయించేది కనుక ఈ నెలను మాయియస్ అన్నారు.

**జూనియస్ :** రోమను రాజ వంశావళిలో జూనియస్ అనే పేరు ఉన్నదని, అతడి పేరు మీదుగా ఈ నెలకు ఆ పేరు వచ్చిందని చెప్తారు.

**క్వింటిలిస్ :** లాటిన్‌లో 'క్వింకె' అంటే 5 అని అర్థం. అందుకే 5వ నెలను క్వింటిలిస్ అని,

**సెక్స్టిలిస్ :** లాటిన్‌లో 'సెక్స్' అంటే 6 అని అర్థం అందుకే 6వ నెలను సెక్స్టిలిస్ అని,

**సెప్టెంబర్ :** లాటిన్‌లో 'సెప్టెమ్' అంటే 7 అని అర్థం అందుకే 7వ నెలను సెప్టెంబర్ అని,

**అక్టోబర్ :** లాటిన్‌లో 'ఆక్టో' అంటే 8 అని అర్థం అందుకే 8వ నెలను అక్టోబర్ అని,

**నవంబర్ :** లాటిన్‌లో 'నవమ్' అంటే 9 అని అర్థం అందుకే 9వ నెలను నవంబర్ అని,

**డిసెంబర్ :** లాటిన్‌లో 'డిసెమ్' అంటే 10 అని అర్థం. అందుకే 10వ నెలను డిసెంబర్ అని అన్నారు.

ఆ తర్వాత క్రీ.పూ.715-673 మధ్య రోమను సామ్రాజ్యాన్ని పాలించిన చక్రవర్తి న్యూమా పాంపిలియస్ సుమారు క్రీ.పూ.700 ప్రాంతంలో పై క్యాలెండర్‌లో కొంతమార్పులు చేసి, జాన్యువారియస్, ఫిబ్రువారియస్ అను మరో రెండు నెలలను జతచేశాడు. అది ఈ క్రింది విధంగా ఉంది చూడండి!

| | | |
|---|---|---|
| మార్షియస్ (Martius) | – | 31 రోజులు |
| ఏప్రిలిస్ (Aprilis) | – | 29 రోజులు |
| మాయియస్ (Maius) | – | 31 రోజులు |
| జూనియస్ (Junius) | – | 29 రోజులు |
| క్వింటిలిస్ (Quintilis) | – | 31 రోజులు |
| సెక్స్టిలిస్ (Sextilis) | – | 29 రోజులు |
| సెప్టెంబర్ (September) | – | 29 రోజులు |
| అక్టోబర్ (October) | – | 31 రోజులు |
| నవంబర్ (November) | – | 29 రోజులు |
| డిసెంబర్ (December) | – | 29 రోజులు |
| జాన్యువారియస్ (Januarius) | – | 29 రోజులు |
| ఫిబ్రువారియస్ (Februarius) | – | 28 రోజులు |

355 రోజులతో 12 చాంద్రమాసాలను ఏర్పాటు చేశారు. అయితే చాంద్రమాసంలో 29 లేదా 30 రోజులు మాత్రమే ఉండాలి. కాని, రోమనులకు సరి సంఖ్య అశుభసూచకం కాబట్టి 29 రోజులు మరియు 31 రోజులుగా ఏర్పాటు చేసుకున్నారు. అయితే ఫిబ్రువారియస్ క్షుద్ర దేవతలకు అంకితమైన మాసం కావడంతో, సరి సంఖ్యయైన 28 రోజులే ఉంచారు.

**జాన్యువారియస్ :** 'జానుస్' అనే పేరు గల రెండు తలల దేవత ఒకతి ఉండేది. దాని నుంచే ఈ నెల పేరు వచ్చిందని చెప్తారు.

**ఫిబ్రువారియస్ :** 'ఫిబ్రువా' అనే రోమను మత సంబంధమైన పర్వదినం ఈ నెల 15న వచ్చేది. అందుకని ఈ నెలకు ఆ పేరు పెట్టారు.

ఈ క్యాలెండర్ సూర్యగతిని అనుసరించడానికి 'మెర్సిడోనియస్' అనే పేరుతో ఒక అధికమాసాన్ని చేర్చాలని న్యూమా చక్రవర్తి ఆదేశించాడు. కాని ఎప్పుడు చేర్చాలో

ఖచ్చితమైన నిర్ణయం చేయబడలేదు. ఆ విధంగా తప్పుల తడకలతో కూడిన క్యాలెండర్ కొన్ని శతాబ్దాల వరకు కొనసాగింది. అయితే ఆ మధ్యకాలంలోనే జాన్యువారియస్, ఫిబ్రువారియస్‌లు మొదటి, రెండు నెలలుగా మారిపోయాయి. అయితే అది ఎప్పుడు, ఎందుకు, ఎలా జరిగిందో వివరాలు అందుబాటులో లేవు.




**జూలియస్ సీజర్** (Julius Caesar) నియంతగా (Dictator) ఉన్న సమయంలో (క్రీ.పూ. 49–44) తప్పుల తడకగా ఉన్న రోమన్ క్యాలెండర్‌ను సరిదిద్దడానికి నిర్ణయం తీసుకున్నాడు. ఇందు కోసం ఆ బాధ్యతను ఎంతో అనుభవజ్ఞుడైన 'సోసీ జెనిస్' అనే గ్రీకు ఖగోళ శాస్త్రజ్ఞుడికి అప్పగించాడు. అప్పటికే గ్రీసులోనూ, ఈజిప్టులోనూ ఖగోళ శాస్త్రం చాలా ఉన్నత స్థితిలో ఉంది. ఈ రెండు రాజ్యాలలోనూ జరిగిన పరిశోధనల సారాంశం సోసీ జెనిస్‌కు బాగా తెలుసు.

ఈజిప్షియన్లు అంతకు ముందే కనిపెట్టిన సంవత్సరం పొడవు $365^1/4$ (365.25) రోజులను ప్రాతిపదికగా తీసుకొని కొత్త క్యాలెండర్‌లో సంవత్సర పొడవు 365 రోజులుగా నిర్ణయించాడు. మిగిలిన $^1/4$ రోజులు నాలుగు సంవత్సరాలు గడిచే సరికి ఒక రోజుగా మారుతుంది. కాబట్టి 4 సంవత్సరాలకు ఒకసారి 366 రోజులు గల లీపు సంవత్సరాన్ని ప్రవేశపెట్టాడు. సోసీ జెనిస్ రూపొందించిన క్యాలెండర్ ఈ క్రింది విధంగా ఉంది చూడండి!

| | | |
|---|---|---|
| జాన్యువారియస్ (Januarius) | – | 31 రోజులు |
| ఫిబ్రువారియస్ (Februarius) | – | 29 రోజులు |
| మార్షియస్ (Martius) | – | 31 రోజులు |
| ఏప్రిలిస్ (Aprilis) | – | 30 రోజులు |
| మాయియస్ (Maius) | – | 31 రోజులు |
| జూనియస్ (Junius) | – | 30 రోజులు |
| క్వింటిలిస్ (Quintilis) | – | 31 రోజులు |
| సెక్స్టిలిస్ (Sextilis) | – | 30 రోజులు |
| సెప్టెంబర్ (September) | – | 31 రోజులు |
| అక్టోబర్ (October) | – | 30 రోజులు |
| నవంబర్ (November) | – | 31 రోజులు |
| డిసెంబర్ (December) | – | 30 రోజులు |

ఒకటి విడిచి ఒకటిగా నెలలకు 31 రోజులు, 30 రోజులు అని విభజన చేశాడు. అలా చేయడం వలన మొత్తం 366 రోజులు అవుతున్నాయి గనుక ఆ అదనపు రోజును ఫిబ్రవరి నెల నుండి తొలగించి, ఆ నెలకు 29 రోజులనీ, లీపు సంవత్సరంలో మాత్రం 30 రోజులనీ సోసీ జెనిస్ నిర్ణయించాడు. అస్తవ్యస్తంగా ఉన్న పాత క్యాలెండర్‌ను మార్చి కొత్త క్యాలెండర్‌ను ప్రారంభించే ముందు, వసంత విషవత్తు మార్చి 25వ తేదీన వచ్చే విధంగా క్రీ.పూ. 46వ సంవత్సరానికి అధికంగా 90 రోజులు కలిపి 445 రోజులు ఉంచాడు. ఆ తర్వాత నుండి అనగా క్రీ.పూ. 45వ సంవత్సరం నుండి సంవత్సరానికి 365 రోజులు, లీపు సంవత్సరానికి 366 రోజులు అని స్థిరపరచాడు.

అయితే క్రీ.పూ. 44లో క్వింటిలిస్ అనే 7వ మాసానికి జూలియస్ సీజర్ పేరు మీదుగా 'జూలియస్'గా నామకరణం చేశారు. ఆ తర్వాత చక్రవర్తి అయిన **సీజర్ ఆగస్టస్** (Caesar Augustus) క్రీ.పూ. 8లో తన పేరు మీద కూడా ఒక మాసం ఉండాలని సెక్స్టిలిస్ అనే 8వ మాసానికి 'ఆగస్టస్' అని పేరు పెట్టించాడు. అంతటితో ఊరుకోకుండా ఆగస్టులో ఉన్న 30 రోజులను 31 రోజులుగా మార్పించి, అధనంగా వచ్చిన 1 రోజును ఫిబ్రవరి మాసం నుండి తొలగింపచేసి, మిగిలిన మాసాల రోజులను కూడా సరిచేయించాడు. అయితే లీపు సంవత్సరంలో ఫిబ్రవరి నెలలో అదనంగా చేర్చిన రోజును వేరే రోజుగా లెక్కించేవారు కాదు. దానిని రెట్టింపు రోజు అనేవారు. **ఫిబ్రవరి 28 శనివారం అయితే, ఫిబ్రవరి**

29ని కూడా శనివారంగానే పరిగణించేవారు.

ఆగస్టస్ చక్రవర్తి మార్పించిన క్యాలెండర్ ఈ క్రింది విధంగా ఉంది చూడండి!

| | |
|---|---|
| జాన్యువారియస్ (Januarius) | – 31 రోజులు |
| ఫిబ్రువారియస్ (Februarius) | – 28 రోజులు |
| మార్షియస్ (Martius) | – 31 రోజులు |
| ఏప్రిలిస్ (Aprilis) | – 30 రోజులు |
| మాయియస్ (Maius) | – 31 రోజులు |
| జూనియస్ (Junius) | – 30 రోజులు |
| జూలియస్ (Julius) | – 31 రోజులు |
| ఆగస్టస్ (Augustus) | – 31 రోజులు |
| సెప్టెంబర్ (September) | – 30 రోజులు |
| అక్టోబర్ (October) | – 31 రోజులు |
| నవంబర్ (November) | – 30 రోజులు |
| డిసెంబర్ (December) | – 31 రోజులు |

ఆ తర్వాత వచ్చిన 'తైబీరియస్' చక్రవర్తి నెలలకు చక్రవర్తుల పేర్లు పెట్టే ప్రయత్నాలను ఆపివేశాడు. కాని 'నీరో' చక్రవర్తి మాత్రం ఏప్రిల్ మాసాన్ని తన పేరు మీదుగా 'నెరోనియస్' అని పిలవాలని శాసించినా, అది అమలుకు నోచుకోలేదు. అయితే క్రీ.శ. 321లో 7 రోజులున్న వారాన్ని వాడాలని, ఆదివారం విశ్రాంతి దినంగా ఉండాలని కాన్స్టాంటైన్ చక్రవర్తి నిర్ణయించే వరకు 8 రోజుల వారాన్నే (nundinae) వాడేవారు.

## రోమను శకము (AUC) :

రోము నగరానికి శంకుస్థాపన జరిగినప్పటి నుండి కొత్త శకాన్ని ప్రారంభించాలని ఆగస్టస్ చక్రవర్తి నిశ్చయించాడు. అంటే క్రీ.పూ. 753 నుండి జూలియన్ క్యాలెండర్ ప్రారంభమౌతుంది. దీనినే Anno Urbis Conditae (AUC) అంటారు. సీజర్ ఆగస్టస్ (జననం: క్రీ.పూ. 63 – మరణం: క్రీ.శ. 14) రోమన్ సామ్రాజ్యాన్ని క్రీ.పూ. 27–క్రీ.శ. 14 వరకు పరిపాలించాడు. రోమన్ శకము ప్రకారం AUC 727 నుండి AUC 767 వరకు పరిపాలించాడు అని చెప్పవచ్చును.

## క్రీస్తు శకము (Anno Domini) :

**'డయనోషియస్ ఎక్సిగ్యువస్'** (Dionysius Exiguus : 475-544 AD) అనే రోమన్ సన్యాసి క్రీ.శ. 525లో ఈస్టర్ తేదీలు గల 'ఈస్టర్ టేబుల్'ను తయారు చేశాడు. క్రీ.శ. 532 నుండి 626 వరకు 95 సంవత్సరాల ఈస్టర్ టేబుల్‌ను రూపొందించాడు. ఇతన్నే **'డెన్నిస్ ది లిటిల్'** అని లేదా 'డెన్నిస్ ది హంబుల్' అని పిలుస్తారు.



గతంలో అలెగ్జాండ్రియాకు చెందిన సిరిల్ (Patriarch Cyril of Alexandria) క్రీ.శ. 430 ప్రాంతంలో క్రీ.శ. 437–531 వరకు తయారు చేశాడు. సిరిల్ కంటే ముందుగా థియోఫిలస్ (Theophilus' Paschal table) పాస్చల్ టేబుల్‌ను క్రీ.శ. 390 ప్రాంతంలో రూపొందించినప్పటికీ అది అంతగా వినియోగంలోకి రాలేదు. అయితే సిరిల్ రోమన్ శకము (AUC) ప్రకారంగా కాకుండా రోమన్ ఎంపరర్ అయిన డయోక్లేషియన్ శకము (Diocletian era (Latin: anno Diocletiani) ఆధారం చేసుకొని ఈ టేబుల్‌ను తయారు చేశాడు. డయోక్లేషియన్ శకము 20 నవంబర్, 284 నుండి ప్రారంభమౌతుంది. అయితే డెన్నిస్ ది లిటిల్ తన 95 సంవత్సరాల ఈస్టర్

టేబుల్‌ను డయోక్లేషియన్ శకంతో కాకుండా **'అన్నో డోమిని'** (Anno Domini) అంటే ప్రభువు జన్మదినంతో ఒక కొత్త శకాన్ని ప్రారంభించాలని నిర్ణయించుకున్నాడు.

ఎందుకంటే క్రైస్తవులను ఘోరంగా చిత్రహింసలపాలు చేసిన డయోక్లేషియన్‌ను గుర్తు చేసుకోవడం ఇష్టం లేకపోవడంతో ఇలా క్రీస్తు శకాన్ని ఉపయోగించాలని అనుకున్నాడు. ఇందుకోసం యేసు క్రీస్తు పుట్టిన రోజుతో ప్రారంభమయ్యే శకాన్ని రూపొందించే ప్రయత్నం చేశాడు. నిజానికి క్రీస్తు జన్మదినమునకు సంబంధించి బైబిల్లో ఎలాంటి ఆధారాలు లేవు. ఇందుకోసం వివిధ దేశాలు తిరిగాడు, ఎన్నో పుస్తకాలు తిరిగేసాడు, మరెన్నో పరిశోధనలు చేశాడు.

అయితే క్రీ.శ. 221లో సెక్స్‌టస్ జూలియస్ ఆఫ్రికానస్ (Sextus Julius Africanus (c.160 – c.240) అనే క్రైస్తవ పండితుడు, చరిత్రకారుడు ఐదు సంపుటాలు గల **'క్రానోగ్రాఫియల్'**ను రచించాడు. ఇందులో సృష్టి నుండి క్రీస్తు వరకు 5500 సంవత్సరాలుగా గుర్తించి రాశాడు. 5501 యొక్క మొదటి రోజున క్రీస్తు అవతార దినాన్ని పొందుపరిచాడు. అంటే ప్రస్తుత కాలమానం ప్రకారం క్రీ.పూ. 1, మార్చి 25వ తేది అవుతుంది. అంటే క్రీస్తు 9 నెలల తర్వాత డిసెంబర్ 25న జన్మిస్తాడన్నమాట. గతంలో రోమన్‌లు వింటర్ సోలిస్టైస్ (దక్షిణాయణాంతం) రోజున అనగా డిసెంబర్ 23-25 ప్రాంతంలో సూర్యునికి సంబంధించిన dies solis invicti nati (day of the birth of the unconquered sun) అనే ఒక పెద్ద పర్వదినాన్ని జరుపుకునేవారు. ఆ తర్వాత రోమన్‌లను క్రైస్తవ మతంలోకి ఆకర్షించడానికి ఈ పండుగను క్రిస్మస్‌గా మార్చారు అని కొందరి అభిప్రాయం. అయితే క్రీ.శ. 336లో డిసెంబర్ 25న మొట్టమొదటి సారిగా రోమన్ క్యాథలిక్కులు క్రిస్మస్‌ను జరుపుకున్నట్లు రికార్డు అయ్యింది. **అంటే డెన్నిస్ ది లిటిల్ తన అన్నో డోమిని తయారు చేయడానికి ముందే కేథలిక్కు సంఘం క్రిస్మస్‌ను జరుపుకుంటోందన్న మాట!**

అయితే డెన్నిస్ ది లిటిల్ ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని క్రీస్తు సున్నతి పొందిన తేదీ (8వ రోజు) నుండి తన శకాన్ని ప్రారంభించాడు. అంటే క్రీస్తు జన్మదినం క్రీ.పూ. 1, డిసెంబర్ 25 రోజున అవుతుందన్నమాట. అప్పుడు అమలులో ఉన్న రోమన్ శకములో 754వ సంవత్సరాన్ని క్రీ.శ. 1 గా తీసుకొని తన అన్నో డోమిని శకాన్ని తయారు చేశాడు.

ఆ విధంగా డెన్నిస్ ది లిటిల్ చేత తయారు చేయబడిన అన్నో డోమిని సుమారు 2 శతాబ్దాల తరువాత క్రీ.శ. 748లో అమలులోకి వచ్చింది. అదే ఇప్పుడు మనం వాడుతున్నాము. అయితే క్రీ.శ. 1219లో సంవత్సర సంఖ్య ప్రక్కన క్రీ.శ. అని సూచించడానికి A.D. (Anno Domini) అని వ్రాయడం ప్రారంభించారు.

## డెన్నిస్ ది లిటిల్ లెక్క తప్పింది:

అయితే క్రీస్తు పుట్టిన సంవత్సరాన్ని నిర్ణయించడంలో డెన్నిస్ ది లిటిల్ పొరపాటు చేశాడు. చరిత్రకారులు చేసిన పరిశోధనల ఆధారంగా యేసు ప్రభువు, క్రీ.పూ. 4 లేదా 5వ సంవత్సరంలో జన్మించాడని తేలింది. అలాగే క్రీ.పూ. 1వ సంవత్సరం తర్వాత క్రీ.శ. 1 వచ్చేస్తుంది. మధ్యలో **'సున్న'** అనే సంవత్సరం లేదు. అంతేగాకుండా కొత్త శకం ప్రకారం క్రీస్తు జన్మదినం జనవరి 1 అవ్వాలి గదా! కాని అప్పటికే కేథలిక్కు సంఘం జీసస్ పుట్టిన రోజు అయిన క్రిస్మస్‌ను డిసెంబర్ 25న జరుపుకుంటోంది. కాబట్టి దానిని మార్చే ప్రయత్నం చేయలేదు. అంతేగాకుండా జూలియన్ క్యాలెండర్ ప్రారంభ సమయంలో క్రీ.పూ. 46లో అదనంగా చేర్చిన 90 రోజులను కూడా లెక్కలోకి తీసుకోలేదు.

ఈ విధంగా తయారైన అన్నో డోమినిలో యేసు ప్రభువు తనకంటే 4-5 సంవత్సరాల ముందు పుట్టాడు. అయితే ఈ తప్పులను సవరించకుండానే క్రీస్తు శకం అనేది వాడుకలోనికి వచ్చేసింది. చరిత్ర పరిశోధనలో సున్న సంవత్సరం లేకపోవడాన్ని, యేసు ప్రభువు జననం 4-5 సంవత్సరాల క్రితం జరగడాన్ని గుర్తు పెట్టుకోవాల్సి ఉంటుంది.

## గ్రెగోరియన్ క్యాలెండర్:

క్రీ.పూ. 45లో అమలులోకి వచ్చిన జూలియన్ క్యాలెండర్ మిగిలిన అన్ని క్యాలెండర్ల కన్నా ఉత్తమమైనదైనప్పటికీ, అది పూర్తిగా దోషరహితమైనది కాదు. దానికి కారణం సంవత్సరం పొడవును సరిగ్గా నిర్ణయించక పోవడమే. సాయన సంవత్సరం పొడవు 365.2422 కాగా జూలియన్ క్యాలెండర్ ప్రకారం 365.25 రోజులు. అంటే

సంవత్సరానికి +12 నిమిషాల 12.5 సె॥ ఎక్కువ ఉందన్నమాట. ఇది చాలా చిన్న దోషమైనప్పటికీ 128.4 సంవత్సరాలు గడిచే సరికి ఒక పూర్తి రోజుకు సమానం అవుతుంది.

క్రీ.శ.325లో (జూన్, 19) నైసియాలో జరిగిన క్రిస్టియన్ కౌన్సిల్‌లో వసంత విషువత్తు తరువాత వచ్చే పూర్ణిమ తర్వాత వచ్చే మొదటి ఆదివారంనాడు **'ఈస్టర్'** అని నిర్ణయం చేశారు. అలాగే వసంత విషువత్తు మార్చి21న వుండాలి అని కూడా సమావేశంలో నిర్ణయమైంది. ఎందుకంటే ఆ సంవత్సరంలో వసంత విషువత్తు మార్చి 21న వచ్చింది కాబట్టి, ఇక మీదట ఎప్పుడూ మార్చి21న వచ్చేలా ఉండాలని నిర్ణయించారు. అప్పటి వరకు వాడుతున్న 8 రోజుల వారం స్థానంలో 7 రోజుల వారాన్ని వాడాలని నిర్ణయించారు. ప్రస్తుత సంవత్సరంలో విషువత్తులు, ఆయణాంతాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

2021 వసంత విషువత్తు – మార్చి 20
2021 శరద్ విషువత్తు – సెప్టెంబర్ 23
2021 ఉత్తరాయణాంతం – జూన్ 21
2021 దక్షిణాయణాంతం – డిసెంబర్

విషువత్తులను, ఆయణాంతాలను చూపే ఈ క్రింది పటం ఒకసారి గమనించండి!




అయితే జూలియన్ క్యాలండర్‌లో ఉన్న 12 ని॥ 12.5 సె॥ దోషము కొన్ని సంవత్సరాలు గడిచేసరికి వసంత విషువత్తు వెనక్కి జరగడం మొదలుపెట్టింది. 15వ శతాబ్దం వచ్చేసరికి అంటే క్రీ.శ.1410 ప్రాంతంలో వసంత విషువత్తు మార్చి 12న అయ్యింది. వసంత విషువత్తుకు ఈస్టర్‌కు లింకు ఉన్నందున ఈస్టర్ నిర్ణయంలో మతాధికారులకు ఇబ్బందులు ఎదురయ్యాయి. ఈ సమస్యకు విరుగుడు జూలియన్ క్యాలెండర్‌ను సవరించడం ఒక్కటే మార్గం అని పలువురు అభిప్రాయపడ్డారు.

క్రీ.శ.1417లో కార్డినల్ పీరీ ది ఏలీ ఫ్రాన్సులో అలజడి లేవదీశాడు. క్యాలెండర్ సంస్కరణ జరపాలని 1436లో జర్మన్ కార్డినల్ నికొలసస్ క్యూజా క్యాలెండర్‌లోని కొన్ని రోజులను వదిలేసి వసంత విషువత్తు మార్చి 21వ తేదీకి వచ్చేటట్లు చెయ్యాలని ప్రతిపాదించాడు. 1474లో పోప్ సిక్టస్–IV జర్మన్ ఖగోళవేత్త రీజియో మాంటనస్‌ను పిలిపించి, ఈ విషయమై ఏమి చేయాలో సలహా ఇమ్మని కోరాడు. కాని ఆ పని పూర్తి కాకుండానే ఆ శాస్త్రజ్ఞుడు చనిపోయాడు.

ఆ తర్వాత క్రీ.శ.1572లో గ్రిగరీ–XIII పోప్ కాగానే క్యాలెండర్ సంస్కరణ కోసం లూయిగీ లీలియో, ఏంటోనియో లీలియో అనే ఇద్దరు ఖగోళవేత్తలను పిలిపించి, ఆ పని అప్పగించాడు. వారు వసంత విషువత్తును పరిశీలించి, అప్పటికి నడుస్తున్న జూలియన్ క్యాలెండర్‌లో నుండి 10 రోజులను వదిలేసి వసంత విషువత్తును మార్చి 21వ తేదీకి తీసుకురావాలని, అటు తరువాత నుంచి 400చే నిశ్శేషంగా భాగించబడని శతాబ్ద సంఖ్యలను లీపు సంవత్సరాలుగా పరిగణించకూడదని ప్రతిపాదించాడు. అంటే, 1600, 1700, 1800, 1900, 2000, 2100 వంటివి లీపు సంవత్సరాలే కానీ, 400చే నిశ్శేషంగా భాగింపబడని 1700, 1800, 1900, 2100 వంటివి లీపు సంవత్సరాలు కావు. జూలియన్ క్యాలెండర్ ప్రకారం అవి కూడా లీపు సంవత్సరాలే. **ఇదీ ఈ సంస్కరణలోని ముఖ్యాంశం.**

క్రీ.శ.1581లో పోప్ గ్రెగరీ తన ఆజ్ఞను జారీ చేశాడు; **'రాబోయే 1582వ సం॥ అక్టోబర్ నెలలో 5 నుండి 14 వరకూ గల తేదీలను వదిలెయ్యాలి'** అని. ఈవిధంగా గ్రెగోరియన్ క్యాలండర్ అవతరించింది. కేథలిక్కు దేశాలు వెంటనే ఈ మార్పును అంగీకరించాయి. ఎందుకంటే వారికి ఈస్టర్ ముఖ్యం కాబట్టి. ఆ తర్వాత జర్మనీ 1699లో, ఇంగ్లాండు 1752 సెప్టెంబర్‌లో గ్రెగొరియన్ క్యాలెండర్‌ను ఆమోదించాయి. మన ఇండియాను బ్రిటిషర్స్ పరిపాలించారు కాబట్టి వారి ద్వారా ఇండియాలో కూడా గ్రెగోరియన్ క్యాలెండర్ వాడుకలోకి వచ్చి ఉండొచ్చును.

అయితే ఈ గ్రెగోరియన్ క్యాలెండర్ కూడా పూర్తి

దోషరహితమైనదేం కాదు. ఇంకా 24.6 సెకనుల దోషం ఉన్నది. 3513 సంవత్సరాలు గడిచే సరికి ఈ దోషం పూర్తి రోజుతో సమానమవుతుంది.

## యూదుల క్యాలెండర్:

యూదులు మొదట ఎడారులలో నివసించే రోజుల్లో అక్కడ వ్యవసాయం ప్రసక్తే లేదు కాబట్టి రుతుచక్రంతో సంబంధంలేని కేవల చాంద్ర పంచాంగాన్ని అనుసరించేవారు. నెలకు 29 గాని 30 గాని రోజులు, సంవత్సరానికి 12 నెలలు, 7 రోజుల వారాన్ని ఉపయోగించేవారు. నెలకు 4 వారాలు పోను మిగిలిన ఒకటి, రెండు రోజులను వార రహితంగా ఉంచేవారు.

యూదులు ఈజిప్టులో ఉండగా (సుమారు 1870–1440) అక్కడ వేరే పద్ధతిలో నడుస్తున్న క్యాలెండర్‌ను చూచారు. అక్కడ నెలకి 30 రోజులు, నెలని 3 సమభాగాలు చేసేవారు. ఒక్కొక్క భాగానికి పదేసి రోజులు ఉండేవి.

మోషే నాయకత్వంలో యూదులు ఈజిప్టునుండి పాలస్తీనాకు వలస పోయారు. ఇది సుమారు క్రీ.పూ. 1440 ప్రాంతంలో సంభవించింది. అక్కడ వ్యవసాయం ముఖ్య వృత్తి కనుక సౌరగమనాన్ని, రుతుచక్రాన్ని అనుసరించి తమ పూర్వపు చాంద్ర పంచాంగాన్ని సవరించవలసిన అవసరత ఏర్పడింది. తదనుగుణంగా అధిక మాసాన్ని చేర్చి నీసాన్ మాసాన్ని ఎదరకు జరిపేవారు.

యూదులు బాబిలోనియా (సుమారు క్రీ.పూ. 597) చేరుకున్నపుడు అక్కడ అప్పటికే ఖగోళ విజ్ఞానం బాగా అభివృద్ధి చెంది చాంద్ర–సౌర పంచాంగం స్థిరపడిన కారణం చేత యూదులు కూడా బాబిలోనియన్ కేలండరునే చాలా వరకు అనుసరించారు. 19 సంవత్సరాల మేటన్ చక్రాన్ని యూదులు ఉపయోగించడం మొదలుపెట్టారు.

అయితే యూదులు రోజును సూర్యాస్తమయంతో మొదలు పెట్టి అనగా సా॥ 6.00 గం॥ల నుండి తిరిగి మరునాటి సా॥ 6.00 గం॥ల వరకు లెక్కిస్తారు.

## యూదు క్యాలెండర్‌లోని వారాలు:

యోమ్ రిషోన్ – అంటే మొదటి రోజు అని అర్థం
యోమ్ షెని – అంటే రెండవ రోజు అని అర్థం
యోమ్ షిలిషి – అంటే మూడవ రోజు అని అర్థం
యోమ్ రెవి – అంటే నాలుగవ రోజు అని అర్థం
యోమ్ చమిషి – అంటే ఐదవ రోజు అని అర్థం
యోమ్ షిషి – అంటే ఆరవ రోజు అని అర్థం
యోమ్ షబ్బాత్ – అంటే ఏడవ రోజు అని అర్థం

## యూదు క్యాలెండర్‌లోని మాసాలు:

తిష్రీ (Tishrei) (Sep-Oct) – 30 రోజులు
హేష్వన్ (Heshvan) (Oct-Nov) – 29/30 రోజులు
కిస్లెవ్ (Kislev) (Nov-Dec) – 30/29 రోజులు
తేబేత్ (Tevet) (Dec-Jan) – 29 రోజులు
షెబత్ (Shevat) (Jan-Feb) – 30 రోజులు
అదర్ (Adar) (Feb-Mar) – 29/30 రోజులు
నీసాను (Nissan) (Mar-Apr) – 30 రోజులు
ఇయార్ (Iyar) (Apr-May) – 29 రోజులు
సివాన్ (Sivan) (May-Jun) – 30 రోజులు
తమ్ముజ్ (Tammuz) (Jun-Jul) – 29 రోజులు
ఆవ్ (Av) (Jul-Aug) – 30 రోజులు
ఎల్లూల్ (Elul) (Aug-Sep) – 29 రోజులు

మామూలుగా తిష్రీ యూదులకు మొదటి మాసం. వారి క్యాలెండర్ తిష్రీ మాసంతో మొదలవుతుంది. తిష్రీ మొదటి రోజున సంవత్సరాదిని (Rosh Hashana) జరుపుకుంటారు. కాని మత సంబంధమైన వాటి కోసం నీసానును మొదటి మాసంగా ఉపయోగిస్తారు (నిర్గమ 12:2).

| Hebrew | Babylonian | Assyrian [iii] |
|---|---|---|
| Nisan | Arah Nisanu | Nisanu |
| Iyar | Arah Aru | Iyaru |
| Sivan | Arah Simanu | Simanu (Khzeeran) |
| Tammuz | Arah Dumuzu | Tamuzu |
| Av | Arah Abu | Abu (Tabakh) |
| Elul | Arah Ululu | Ululu (Elul) |
| Tishrei | Arah Tisritum | Tashritu (Tishrin I) |
| Cheshvan | Arah Samna | Arahsamnu (Tishrin II) |
| Kislev | Arah Kislimu | Kissilimu (Kanoon I) |
| Tevet | Arah Tebetum | Tebetu (Kanoon II) |
| Shevat | Arah Sabatu | Shabatu |
| Adar | Arah Addaru/Arah Adar | Addaru |
| Adar II | Arah Makarusa Addari/Arah Ve-Adar (Intercalary month) | |

ఈ చాంద్రమాన క్యాలెండర్ సూర్యమాన క్యాలెండర్‌తో అనుసంధానించడానికి మేటన్ చక్రం ప్రకారం 19 ఏళ్లలో అదర్ మాసానికి ముందు అదర్–2 అని పిలువబడే 7 అధిక మాసాలను జత చేస్తారు.

## హెబ్రీ శకము :

ప్రపంచ శకం యూదులు ఉపయోగించే శకం. వారి విశ్వాస ప్రకారం ప్రపంచ సృష్టి క్రీ.పూ. 3761వ సం॥లో అక్టోబర్ 7వ తేదీ ఆదివారం రాత్రి 11 గంటల 11 నిమిషాలకు జరిగింది. హెబ్రీ శకము ప్రకారం మన తేది:01-09-2021 అనేది 24 ఎలూల్, 5781 అవుతుంది.

*Source :*

*-en.wikipedia.org/wiki/Calendar*
*-en.wikipedia.org/wiki/Gregorian_calendar*
*-en.wikipedia.org/wiki/Anno_Domini*
*-en.wikipedia.org/wiki/Dionysius_Exiguus*
*-en.wikipedia.org/wiki/Dionysius_Exiguus%27_Easter_table*
*-en.wikipedia.org/wiki/Sextus_Julius_Africanus*
*-en.wikipedia.org/wiki/Christmas*
*-britannica.com/topic/Christmas*
*-livescience.com*
*-worldhistory.org*
*-timeanddate.com*
*-the-light.com*
*-hebcal.com*
*-**calender katha** by Dr.Maheedhara Nalini Mohan*
***-pedda baalashiksha***

*(...15వ పేజీ తరువాత)*

## దేవునికి రాసిన ఉత్తరాలు.....




సందర్భం వచ్చింది గనుక, ఇక్కడో విషయం చెప్పాలనుకుంటున్నాను. 2010లో రియల్‌స్టోరీని ఆధారంగా చేసుకొని హాలివుడ్‌లో ఒక సినిమా రిలీజైంది. దాని పేరు ***Letters to God***. కేన్సర్‌తో చనిపోయిన తన కొడుకు జీవితాన్ని, అతనికి జీసస్‌పై ఉన్న విశ్వాసాన్ని ఆధారంగా జేసుకొని ***Patrick Doughtie*** రాసిన కథనే కొంత డ్రమాటిక్‌గా మార్చి సినిమాగా తీశారు. వీలైతే చూడండి.

## ఇజ్రాయెల్‌లో కొత్త ప్రయోగం... అదృశ్య సైన్యం...???

ఇజ్రాయెల్ ఐడిఎఫ్ కొత్త ప్రయోగానికి శ్రీకారం చుట్టింది. తమ రక్షణ వ్యవస్థను, సైనిక సంపత్తిని పటిష్టం చేసేందుకు ఇజ్రాయెల్ రక్షణ మంత్రిత్వ శాఖ... సైనికులు 'కనబడకుండా ఉండే (అన్ డిటెక్టబుల్ లేదా అన్ విజిబుల్) సరికొత్త టెక్నాలజీని రూపొందించింది. పొలారిస్ సొల్యూషన్స్ అనే సంస్థ సహకారంతో కిట్ -300 అని వ్యవహరించే షీట్‌ని రూపొందిస్తోంది. మైక్రోఫైబర్స్, లోహాలు, పాలిమర్లను వినియోగించి ఓ వల వంటి వ్యవస్థని తాము తయారు చేసినట్లు ఈ సంస్థ వర్గాలు తెలిపాయి. షీట్ లేదా దుప్పటిలా ఉన్న దీని బరువు 1.1 పౌండ్లు మాత్రమేనని, కానీ దీన్ని ధరించినప్పుడు 500 పౌండ్ల బరువును కూడా మోసుకు వెళ్లవచ్చునని ఈ వర్గాలు పేర్కొన్నాయి. డబుల్ సైడెడ్ బ్లాంకెట్‌లా ఉన్న దీన్ని ఓ వైపు ధరించినప్పుడు అడవుల్లోను... మరో వైపు ధరించినప్పుడు ఎడారుల్లోనూ సులభంగా వెళ్ళవచ్చునట. కంటికి కనబడకుండా చేసే ఈ విచిత్రమైన బ్లాంకెట్ ధరిస్తే ఓ రాయిలా కనబడతారని పోలారిస్ సొల్యూషన్స్ సంస్థ ప్రతినిధులు తెలిపారు. ట్రెక్కింగ్ చేసేటప్పుడు, వార్ జోన్లలోనూ ఈ విధమైన రక్షణ కవచాలు ఎంతగానో ఉపకరిస్తాయని వీరు చెబుతున్నారు.



# మనం-మన మిషనరీలు

"ఇంకను అనేక విధములైన మాటలతో సాక్ష్యమిచ్చి -మీరు మూర్ఖులగు ఈ తరమువారికి వేరై రక్షణ పొందుడని వారిని హెచ్చరించెను. కాబట్టి అతని వాక్యము అంగీకరించినవారు బాప్తిస్మము పొందిరి. ఆ దినమందు ఇంచుమించు మూడువేల మంది చేర్చబడిరి"

(అపో.కా. 2:40,41)

పేతురు సువార్త చెబితే ఒకేసారి ఒకేరోజున సుమారు 3000 మంది బాప్తిస్మము పొందారు. ఆ తర్వాత కూడా వేల మంది నమ్ముకున్నారు. ఒక క్రైస్తవునిగా మనకు సువార్తను ప్రకటించడానికి మించిన జీవిత లక్ష్యం మరేముంటుంది?

కానీ మనమేం చేస్తున్నాము. విశ్వాసులకు ఏమని బోధిస్తున్నాము. ఏవిధంగా సిద్ధపరుస్తున్నాము. దేవున్ని అడ్డం పెట్టుకొని డబ్బు సంపాదించడం, ఖరీదైన సూటులు వేసుకోవడం, ఖరీదైన కార్లలో తిరగడం, పేరు ప్రఖ్యాతులు గడించడం, ఉన్నత స్థానాలను ఆశించడం... ఇవే గదా మన జీవిత లక్ష్యాలు, మన మాదిరికర జీవితాలు. **వీటన్నింటికి ఒకరోజు లెక్క అప్పగించుకోవాలనే భయమేమైనా ఉందా?**

నిజానికి మనం 2వ రాజుల గ్రంథం 17వ అధ్యాయంలో చెప్పబడిన షోమ్రోనీయులు (సమరయులు) వలె ఉన్నాము. వారు సింహాలకు భయపడి యెహోవాకు బలులు అర్పిస్తూనే, తమ పితరుల దేవతలను కూడా ఆరాధించారు. మనం కూడా నరకానికి భయపడి దేవున్ని ఆరాధిస్తూనే అన్యుల ఆచారాలను పాటిస్తూ, లోకానుసారంగా జీవిస్తూ ఉన్నాము. ఎవరునూ సిరికిని, దేవునికిని దాసునిగా ఉండనేరరు.

ఇప్పటికైనా మన మనస్సులు మార్చుకొని ప్రభువు చిత్తమెరిగి నడుచుకొనునట్లు మనం రూపాంతరం చెందుదాం.

ఇందుకు ప్రేరణగా తెలుగువాళ్ల పేతురు అయిన **'యర్రగుంట్ల పేరయ్య'** గురించి తెలుసుకుందాం!

క్రీ.శ. 1826లో ప్రకాశం జిల్లాలోని కనిగిరి తాలూకాలోని తలకొండపాడు అనే చిన్న గ్రామములో **యర్రగుంట్ల పేరయ్య** జన్మించాడు. 1862లో క్రీస్తును గురించి తెలుసుకొని అంగీకరించి, 1866 మార్చిలో తన భార్య నాగమ్మతో కలిసి **'జాన్ క్లౌ'** గారి ద్వారా బాప్తిస్మము పొందారు. 1897 జూన్ 2న ప్రభువు నందు నిద్రించే వరకు కొన్ని వేల మందికి సువార్తను ప్రకటించి ప్రభువువైపు తిప్పాడు.

## క్రీస్తును అంగీకరించడం:

దళితుడైన పేరయ్య చెప్పులు కుట్టుకునే వృత్తిలో ఉంటూ, వ్యాపారం నిమిత్తం 1862లో ఏలూరు పట్టణం గుండా వెళుతూ, తన దగ్గరి బంధువైన ఒంగోలు అబ్రహాము గారిని కలిసాడు. అబ్రహాము -తాను చర్చ్ ఆఫ్ ఇంగ్లాండు మిషనరీలను కలవడం, వారు చెప్పిన సువార్తకు ప్రభావితమై క్రీస్తును అంగీకరించడం, దాంతో తన జీవితం మారిపోవడం, తాను తన కుటుంబం ప్రభువునందు ఎంతగానో ఆనందించడం గురించి పేరయ్యకు వివరంగా చెప్పాడు. అబ్రహాము, అతని కుటుంబంలో వచ్చిన ఈ పరివర్తన చూసి ఈ కొత్త మతంపై కొంత ఆసక్తి కలగడంతో కొన్ని సందేహాలను తీర్చుకోవడం కోసం వెంటనే పేరయ్య మిషనరీలను కలవాలనుకున్నాడు.

ఏలూరులో ఉన్న అలెగ్జాండర్‌ను, ఆ తర్వాత పాలకొల్లులో ఉన్న బౌడెన్‌ను కలుసుకున్నాడు. వీరిద్దరూ కూడా చర్చ్ ఆఫ్ ఇంగ్లాండుకు చెందిన మిషనరీలే. వీరు అమెరికన్ బాప్టిస్ట్ మిషన్‌కు చెందిన లైమన్ జువెట్‌కు మంచి మిత్రులు కూడా. వీరు పేరయ్యతో చాలా సమయం కేటాయించి అతనికున్న సందేహాలను నివృత్తి చేశారు. దీంతో పేరయ్య బాప్తిస్మము పొందడానికి సిద్ధపడ్డాడు. అయితే పేరయ్య ఒంగోలుకు చెందినవాడు గనుక అమెరికన్ బాప్టిస్ట్ మిషన్‌కు నడిపించడం సముచితమని వారు భావించారు. అందుకే త్వరలో ఒంగోలుకు ఒక కొత్త మిషనరీ వస్తాడని, అతని సూచనలు పాటిస్తూ బాప్తిస్మం

పొందాలని వారు పేరయ్యకు తెలియజేశారు.



## జీవన విధానం మారడం :

అతను తన స్వగ్రామానికి తిరిగి వచ్చిన తర్వాత విగ్రహాలను పూజించడం మానేసి, తన బంధువైన అబ్రహాము చేసినట్లుగా ప్రార్థన చేయడం ప్రారంభించాడు. అలా అతను క్రైస్తవ జీవన విధానాన్ని అవలంభించాడు. తన ప్రవర్తనకు ఆశ్చర్యపోయిన తన భార్యతో సహా బంధువులందరూ హేళన చేశారు. అయినా అవేమీ పట్టించుకోలేదు. అలా సుమారు ఒకటిన్నర సంవత్సరాలు గడిచిన తర్వాత తన భార్యతో సహా తన బంధువులలోను, చుట్టు ప్రక్కన ఉన్న గ్రామాల్లోనూ చాలా మంది క్రీస్తును అంగీకరించారు. అయితే బాప్తిస్మము పొందడానికి రాబోయే మిషనరీ కోసం ఎదురుచూస్తూ ఒంగోలులోని మిషన్ బంగ్లాకు ఎన్నోసార్లు వెళ్లాడు. నిరాశతో వెనుతిరిగేవాడు. 1866లో పేరయ్య భార్య నాగమ్మ అతని పక్షాన లైమన్ జువెట్‌కు లేఖ రాసింది.

## అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ :

1840లో ఇండియాలో అడుగుపెట్టిన అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ 'ఫలాలు' లేక కష్టాల్లో ఉంది. మిషన్‌ను ఎప్పుడు మూసేద్దామా అని చూస్తున్నారు. అలాంటి సమయంలో 1864లో **జాన్ ఎవరెట్ క్లౌ** (జూలై 16, 1836 –నవంబర్ 24, 1910) ఏబియం తరపున ఆయన భార్య హ్యారీట్ క్లౌతో కలిసి ఇండియాకి వచ్చాడు. మొదట అగ్రకులాలైన బ్రాహ్మణులకు సువార్త చెప్పాలని ప్రయత్నించాడు. కాని ఎలాంటి ఫలితం లేకుండా పోయింది. దాంతో కొద్ది రోజులు నెల్లూరులోనే ఉంటూ తెలుగు భాష నేర్చుకోవడంలో గడిపాడు. ఆ తర్వాత ఏదైనా ప్రాంతానికి వెళ్లడానికి సిద్ధపడుతున్న సమయంలో పేరయ్య గారి భార్య నుండి నెల్లూరులో ఉన్న అమెరికన్ బాప్టిస్ట్ మిషన్‌కు చెందిన లైమన్ జువెట్‌కు ఒక లేఖ అందింది. దాన్ని జాన్ క్లౌకు అందజేసాడు. కొంత తర్జన భర్జన అనంతరం ఒంగోలుకు వెళ్లడానికే క్లౌ నిర్ణయించుకున్నాడు.

## బాప్తిస్మము తీసుకోవడం :

ఉత్తరం అందుకున్న కొన్ని వారాలలో అంటే 1866 మార్చిలో జాన్ క్లౌ , లైమన్ జువెట్, కనకయ్యలు ఒంగోలుకు వెళ్లి పేరయ్యను కలిశారు. పేరయ్యకు, అతని భార్యకు, బంధువులకు బాప్తిస్మములు ఇచ్చారు. ఆ తర్వాత నూతనోత్సాహంతో పేరయ్య తన బంధువులకు, చుట్టూ ఉన్న సుమారు 400 గ్రామాలకు వెళ్లి సువార్త ప్రకటించడం మొదలు పెట్టాడు. వారిలో చాలా మంది ప్రభువును నమ్ముకున్నారు.

## వేల మందికి బాప్తిస్మములిప్పించడం :

పేరయ్య 1878 జూలైలో ఆరుగురు పాస్టర్లతో కూడిన బృందంతో గుండ్లకమ్మ వాగులో బాప్తిస్మములు ఇప్పించాడు. మొదటి రోజున అంటే జూలై 2వ తేదీన 614 మంది బాప్తిస్మములు పొందారు. ఆ తర్వాత రోజైన జూలై 3వ తేదీన 2,222 మందికి బాప్తిస్మములు ఇప్పించాడు. మరుసటి రోజు సుమారు 700 మంది బాప్తిస్మములు పొందారు. పేరయ్య ఎంతో శ్రమపడి తన తోటి వారైన దళితులకు సువార్త అందించి దేవుని కృపను బట్టి వారికి బాప్తిస్మములు ఇప్పించాడు. **మన చరిత్ర మనం రాసుకోకపోవడం వలన దురదృష్టవశాత్తు ఈ క్రెడిటంతా కూడా అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ అకౌంట్‌లో పడిపోయింది.** ఏదిఏమైనప్పటికీ ఇది ఎంతో అద్భుతమైన విషయం.

తెలుగు రాష్ట్రాల చరిత్రలో ఇంత వరకు ఒకేరోజు ఇంత మందికి బాప్తిస్మములిచ్చిన దాఖలాలు లేవు. నిజంగా ఇది మన తరానికి ఒక ప్రేరణగా వుంటుంది. పరిశుద్ధాత్మ దేవుడు మనల్ని బలంగా వాడుకుంటే మనం కూడా ఇలాంటి అద్భుతాలను ఎన్నో చూడగలము.

**ప్రభువు మనందరిని బహుబలంగా వాడుకొనును గాక! ఆమెన్.**

---

*Source :*

*-mosesonmissions.wordpress.com*
*-telugubaptisthistory.weebly.com*
*-**Preaching Contextually** by Anuparthi John Prabhakar*
*-**Andhrapradesh Kraistava Sangha Charitra** by Dr. M. Moses*


Jeriah Bible Mission
*Peddapalli, Telangana-505172*
*jeriahbiblemission@gmail.com*
*jeriahbiblemission.blogspot.com*
 7013 63 9470

పాఠకులకు మన ప్రభువైన యేసుక్రీస్తు నామములో వందనాలు....

మేము అందించే ఈ ఆర్టికల్స్ దయచేసి మీకు తెలిసిన ఇతర క్రైస్తవ సహోదరులకు షేర్ చేయండి. ఒకవేళ ఈ ఆర్టికల్స్‌కు సంబంధించి ఏమైనా మార్పులు, చేర్పులు సూచించడానికి మీరు ఇష్టపడినట్లయితే, మా దృష్టికి రానివి, అప్‌డేట్ చేయాల్సినవి ఏమైనా ఉంటే తప్పకుండా మాతో షేర్ చేసుకోగలరు. అలాగే ఏదైనా అంశానికి సంబంధించిన ఆర్టికల్ కోసం మీరు ఎదురు చూస్తున్నట్లయితే ఆ విషయాన్ని మాకు తెలియపరచినచో మా టీం సభ్యుల ద్వారా మీకు అందించే ప్రయత్నం చేస్తాం. అదేవిధంగా, మీ వద్ద ఏమైనా మంచి సాక్ష్యాలు, వాక్యానుసారమైన, పరిశోధనాత్మకమైన ఆర్టికల్స్ ఉన్నట్లయితే ఈ పత్రికలో ప్రచురించడానికి మీరు ఇష్టపడినట్లయితే మాకు పంపించి ఈ పరిచర్యలో పాలిభాగస్తులు కాగలరని ఆహ్వానిస్తున్నాము.

మరో ముఖ్యమైన విషయమేమంటే, మీరు నివసిస్తున్న పట్టణం, ప్రాంతంలో మొట్టమొదటి సారిగా ఎవరు సువార్త ప్రకటించారో, వారి గురించి, వారి పరిచర్య గురించి వివరాలు సేకరించి మాకు పంపించగలరు. వీలైతే వారి ఫోటోలు కూడా సేకరించండి. మన ప్రాంతాల్లో మన దైవజనులు ఎంతో మంది సువార్త పరిచర్య చేసి సంఘాలను స్థాపించారు. మనం మన చరిత్రను వ్రాసుకునే అలవాటు లేకపోవడం వలన వారి సువార్త పరిచర్య వివరాలు ఎవరికీ తెలియకుండా పోయాయి. ఇకమీదటనైనా వారి పరిచర్య వివరాలు వెలుగులోనికి తీసుకొనిరావడానికి మనవంతు ప్రయత్నం తప్పకుండా చేద్దాం!

ఈ పత్రికా పరిచర్య దేవునికి మహిమకరంగా ఉండునట్లు ప్రార్థించండి. అలాగే మీ యొక్క సహాయ, సహకారాలు మాకు తప్పకుండా అందించండి! దేవుని కృప ఎల్లవేళలా మనకందరికి తోడైయుండి కాచి కాపాడి నడిపించును గాక! ఆమేన్.

- జెరియా బైబిల్ మిషన్